## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 9000000001076

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

*Approved by Andhra T. B. C. Page No. 15|5—5—61.*

# శాంతిదూతలు

రచయిత :
కొడవంటి బ్రహ్మాజీరావు, బి.ఏ., బి.ఇడి., ఎల్. ఎల్. బి.,




బాలసరస్వతి బుక్ డిపో.,
ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్,
కర్నూలు :: మద్రాసు-1

 [ వెల : రు. 1-0-0

# విషయసూచిక







# 1. మహాత్మ గాంధి

యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం॥
పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥

అని శ్రీ కృష్ణ భగవానుఁడు లోకమున కభయ హస్త మిచ్చినట్లు లోకమంతయు నాశాసూయలచే నిండి క్రోధమోహములచేఁ బీడింపఁబడు సమయమున వాని నరికట్టి క్రోధమోహముల నున్మూలించి, నష్టధర్మమును సముద్ధరించి సాధుజనుల సంరక్షింప విరాట్పురుషుండైన పరమశివుండు లీలామానుష విగ్రహుండై మహాత్ముఁడై యవతరించెను.

ఆర్యావర్తమైన భారతదేశము ధర్మక్షేత్రము. ధర్మప్రబోధమున కనుకూల ప్రదేశమగుటచే నిచ్చటనే తత్తత్కాలములఁ బరమేశ్వరుఁడు లీలామానుష విగ్రహుఁడై శ్రీ రామకృష్ణాద్యనేకావతారములఁ దాల్చి జగత్కళ్యాణ సంధాయకుఁడై వెలసియుండెను. ఈ ప్రపంచమందంతటను పారిపణ్యానియంతృత్వము పెచ్చు పెరిగిపోయెను. సామ్రాజ్యతత్త్వ మాభీల కరాళవదనముతో వికటాట్టహాసముగాఁ బ్రళయ తాండవ మొనరించుచుండెను; వలసరాజ్యముల లోని పీడిత ప్రజలు దురంత చింతల దురసిల్లుచు నధమ

జీవితములఁ గాలక్షేపము సేయుచుండిరి ; పాశ్చాత్యప్రభుత్వ పరిపాలనలో భారతీయు లనిర్వచనీయమైన హేయావస్థ పాలైరి ; ఐశ్వర్య లోలుపులైన యాంగ్లేయు లధిక బలో పేతమారణాయుధ దర్పాతిశయమున భారతదేశమును లోఁ బఱచుకొని యనతికాలములోనే పీల్చి పిప్పిచేసి భారతీయుల దౌర్భాగ్యదామోదరులుగా నొనరించివైచిరి. నీరక్తస్రావ విప్లవమార్గమున నేతద్దౌర్భాగ్యమును దొలంగించి సంపూర్ణ స్వాతంత్ర్యము సంపాదించి ప్రపంచమున కంతకు నహింసా తత్త్వ రహస్యము నవధర్మమార్గ ముపదేశింప మరల విశ్వే శ్వరుఁడు మాయాబాలకుఁడై దయామయ మోహన రూప మునఁ బ్రభవించెను.

జన్మస్థానము పోర్బందరు ; తండ్రి కాబాగాంధీ సత్య ప్రియుఁడు, సాహస సంపన్నుఁడు, దయార్ద్రహృదయుఁడు ; తల్లి పుత్లీబాయి దైవభక్తి పరాయణురాలు, సాధ్వి. పోర్బందరునకు సుదామపుర మను నామాంతరమును గలదు. మోహన చందు గాంధీ తన శైశవమును పోరుబందరునందే కడపి, సప్తాబ్దంబులనాఁడు జనకునితోఁ గలసి రాజకోట కరి గెను. ద్వాదశ వర్షముల ప్రాయమున నున్నత పాఠశాలా ప్రవేశము గావించి విద్యాభ్యాసన మొనరించెను. తన చిఱుతతనమునుండియు నసత్య మనిన నేమో యెఱుంగని యాతని మృదుల హృదయమును 'శ్రావణ పితృ భక్తి', 'హరిశ్చంద్ర' నాటకములు రెండును బరవశ మొనరించి వైచినవి. ఒకనాఁడొక విద్యాపరీక్షాధికారి పాఠశాల విద్యా

విధానమును బరీక్షింప వచ్చి, యైదు పదములకు వర్ణక్రమము వ్రాయనిచ్చెను. అందొక మాటకు గాంధీ తప్పు వ్రాయ నుపాధ్యాయుఁడు ప్రక్కనున్న పిల్లవాని బల్ల చూచి వ్రాయు మని కాలి జోడుచే సంజ్ఞ చేసెను. కాని గాంధీ యందుల కంగీకరింపఁ డాయెను. తదనంతర మాతని మాఢ్యము నాతని గురువు నిందించెను గాని, గాంధీ మాత్రము కాపీ కొట్టుట కొప్పుకొనఁడాయెను.

అనాసక్తి యోగ ప్రభావమున సత్యాన్వేషణ ధర్మ మార్గగామియై, సామాన్య మానవుఁడు పురుషోత్తమత్వ ప్రాప్తి పొందఁగలఁడని విషయములఁ దవులువడిన ప్రపంచ మునకుఁ బ్రబోధించి సముద్ధరింప లోకసంగ్రహార్థము భువి నవతరించిన గాంధీ చిన్నతనమునుండియు నెల్ల చిన్న విష యములందును మహత్తర ప్రభావమును బ్రస్ఫుటింపఁజేసెను. గాంధీ యున్నత పాఠశాలలో విద్యాభ్యసనము చేయు కాల ములో తన యన్నగారి సహపాఠి యగు నొక దుష్టునితో స్నేహ మొనరించి, స్నేహితుని దురభ్యాసములనుండి సముద్ధరింపఁ దలంచియుఁ దానె మాంసభక్షణ, వేశ్యాగృహ ప్రవేశము లను పాపకూపములఁ బడిపోనున్న సమయమున నాపతనమునుండి బయట పడి, దుస్సాంగత్య ఫలమును, నీశ్వరానుగ్రహ ప్రభావమును లోకమునకుఁ బ్రకటించెను. అంతటితో సంతృప్తి నొందక, భౌతికముగ దుష్కర్మ లొనరింప కున్నను, మనోమాలిన్యముచే మానవుఁడు నైతిక ముగాఁ బతితుఁడే యనియు, మనోవాక్కాయముల నిష్కల్మ

ష్ఠుఁడై యుండుటయే సంపూర్ణ మైన పారిశుద్ధ్య మనియుఁ బ్రవచించెను.

విషయ లాంపట్యా మైహికాముష్మికములకు రెండింటి కిని గూడ మానవుని బాహ్యునిఁ గావించు నను విషయ మాతఁడు నిజజీవితమున ద్యోతిత మొనరించెను. తండ్రికి మరణారుగ్నత ; భార్య గర్భవతి. ప్రతిదినము భోజనానంత రము గాంధీ తండ్రి పదములొత్తి తన శయన గృహమున కేగుచుండెడివాఁడు. రోగము ముదిరి ప్రమాదావస్థకు వచ్చెను. ఒకనాఁటి రాత్రి పదునొకండు గంటలకుఁ దండ్రి సేవ చేయుచున్న గాంధీకిఁ బినతండ్రి విశ్రాంతి నొసంగెను. గాంధీ తండ్రి పక్క వదలి తన గది చేరెను. నిద్రించుచున్న భార్య యంటరాని గర్భవతి యనియైనఁ దలంపక యామెను మేల్కొలిపెను. మోహాంధుఁడై యాపవిత్రసమయము నప విత్ర మొనరింప నున్న యాతనిని సేవకుఁడు వచ్చి "నిన్ను గన్న తండ్రి యిఁక లేఁ" డని హెచ్చరించెను. గాంధీశోకో ద్విగ్న మానసముతో వాపోయెను. ఆయొక్క క్షణకాలము పాశవప్రేమకు లోనుగాకుండినఁ దన్ను బ్రేమించి పెంచి పెద్ద చేసిన తన తండ్రినుండి యెడబాటా యవసాన సమయ మునఁ దనకు సంప్రాప్తించి యుండక పోవును గదా యని యాతఁడు దుఃఖించెను. కామినీ కాంచనములు, విషయ లౌల్యము మానవుని ధర్మపథమ్మునుండి తప్పించి ముక్తి మార్గావరోధకములై నెగడును గదా యని యాతఁడు చింతించెను.

క్రీ. శ. 1887 లో గాంధీ తన పదునెన్మిదియవ సంవత్సరమున మెట్రిక్యులేషను పరీక్షలో నుత్తీర్ణుఁడాయెను. భావనగరములో శ్యామలదాసు కాలేజీలోఁ జేరెను గాని యా వాతావరణ మాతనికి సుముఖముగా నుండకపోవుట చేతఁ గొలఁది కాలములోనే కాలేజీ చదువు విరమించుకొని యిల్లు చేరెను. కుటుంబ సభలోఁ దర్జన భర్జనలైన పిమ్మట గాంధీ యింగ్లండునకు బారిష్టరీ చదువుటకు వెళ్ళిన బాగుగా నుండునని తేలినది. తనయుఁడు పాశ్చాత్య దేశాటనముచే భ్రష్టుఁ డగునేమోయని తల్లి పుత్తలీబాయి సంకోచించుచుండఁ గుటుంబమిత్రుఁడైన బేచార్జీ స్వామి గాంధీచే మద్య స్త్రీపలలము లంటనని శపథముఁ జేయించి, తల్లి మనోవ్యథఁ దొలఁగించి యామెచే నొప్పించి ప్రయాణము నిశ్చయించెను.

గాంధీ లండనునివాస మొక పెద్ద యావిష్కరణ ప్రయోగము. దేశకాలాచారతత్వము, శాకాహారమహాత్వము, సాధుజీవనము, సత్యాన్వేషణము పరిశోధన సామగ్రిగా ననేక విషయముల నిజస్వరూపం బెఱుంగుచు విదిత సకల మతసార సంగ్రహుఁడై, పాపావరోధముల నధిగమించుచు 1891 లో లా పరీక్షలోఁ గృతార్థుఁడై పట్టభద్రుఁడాయెను.

గాంధీ భారతదేశములోఁ గాలుపెట్టి, బొంబాయిలో బల్లగట్టెను. ఆఱు నెలలలో నా బల్ల రాజకోటకు మార్చఁబడెను. మఱి కొద్దికాలములో దాదా అబ్దుల్లా కంపెనీ తరుఫున ఆఫ్రికా ప్రయాణము తటస్థించెను. నేటాలు చేరిన

తరువాత నొకనాఁడు డర్బను కోర్టుకు సేట్ అబ్దుల్లా, గాంధీని దీసికొని వెళ్లి యక్కడివారితోఁ బరిచయము గలిగించెను. కోర్టు హాలులో గాంధీ తనపాగా పగిడీతో నబ్దుల్లా యొక్క లాయరు ప్రక్క నాసీనుఁడాయెను. మేజిస్ట్రేటు గాంధీవంక తదేకదీక్షగా దృష్టి సారించి, చివర కాపాగా తీసివేయుమని యాజ్ఞాపించెను. గాంధీ యా యవమానమును సహింపలేక కోర్టు విడిచి వెడలిపోయెను. పాగా విడిచి దొర టోపీ ధరించిన యీ యవమతి జరుగక పోవచ్చునని యూహించు చుండఁగా, అబ్దుల్లా, గాంధీతో నట్టి పని పురుషోచితము కాదనియు, నతఁడట్లు చేసినచోఁ బాగాలవారైన యితర భారతీయుల వస్త్రధారణగౌరవ మనపాయముగా నుండఁ జాలదనియుఁ, దొందరపడి మార్చుట మంచిది కాదనియు హితోపదేశము గావించెను. వెంటనే గాంధీ యీ విషయ మును బ్రచురించి కోర్టులోఁ బాగా వేయుట యను తన స్వాతంత్ర్యము నరికట్టరాదని, తన హక్కును నిలబెట్టు కొను వాదము పత్రికలలోఁ బ్రకటించెను; ఏదెటులైనను బాగా మాత్ర మాతఁ డాఫ్రికాలో నా పర్యాయ మున్నంత వఱకును దొలఁగించలేదు.

తెల్ల దొరలతో నిండియుండిన యా దక్షిణాఫ్రికా దేశమం దెక్కడఁ జూచినను జాతివైషమ్యమే; భారతీయు లనినఁ గూలివారని నిరసనయే. అట్టివారు గాంధీని గూలి బారిష్టరనిరి. మొదటి తరగతికిఁ గొన్ని చోట్ల టిక్కెట్లే యీయఁబడవు. లభించిన స్థలములలోనైనఁ బొమ్మని

నపుడు మూఁడవ తరగతి బండిలోనికిఁ బోవలసినదే; అట్లు పోనని భీష్మించుకొని కూర్చున్న గాంధీ నొక తెల్ల పోలీసు వచ్చి మెడబట్టి నెట్టివేసెను. బండిలో మొదటి తరగతి టిక్కెటు విలిచియు, లోన దొరలతోఁ గూర్చుండఁ దగఁడని గాంధీని బయట బండితోలువాని ప్రక్కను, వాండ్రు పాదము లుంచుకొను నికృష్ట స్థలమునందును గూర్చుండ నియోగించిరి. ఇట్టి యసందర్భపు నడవడిక యక్కడ సాధారణాచారమై యుండెను. కేవల ధనార్జనయే పరమావధిగా నటకు వేంచేసిన నానామత భారతీయులు నిట్టి యవజ్ఞ కలవాటు పడిపోయిరి. గాంధీ యాఫ్రికాలోఁ గాలుపెట్టిన పని యొకటి, యిప్పుడు కాళ్లకుఁ జుట్టుకొనిన పని మఱియొకటి—అచ్చట నున్న వర్ణవైషమ్య హాలాహలమునుండి వెఱ్ఱిబాగులైన భారతీయులను సంరక్షించుట.

సత్యాగ్రహభావము ప్రప్రథమమున దక్షిణాఫ్రికాలోనే మూర్తి ధరించినది. ప్రభుత్వపు దుర్ణయములను బ్రజలెదుర్కొనఁదగిన సాధన మదియని గాంధీ గ్రహించెను. సత్యాన్వేషణ మెప్పుడును హింసా మార్గమున జరుగదు. మన ప్రతిస్పర్థులపైఁ గ్రోధము వహింపరాదు. ప్రేమచేతనే శత్రుచమూచయంబును జయించ నగు నని ప్రబోధించెను. అన్యాయము జరిగినయెడలఁ బిఱికితనమునఁ జేతకానివారివలె నూరకుండుట పాపమనియు, ధర్మసంరక్షణార్థము ప్రాణత్యాగమునకైన సంసిద్ధమై యహింసా మార్గమునఁ బ్రతిఘటించి, సహాయ నిరాకరణాద్యాయుధముల విజయాలం

కృతులు కావలెననియు హెచ్చరించెను. స్వయముగా సత్యాగ్రహము నడపి కష్ట నిష్ఠురములకు నోర్చి తుట్టతుద కాఫ్రికా భారతీయులకు విజయము చేకూర్చి, కష్టములఁ దొలఁగించి, యానంద సౌఖ్యములఁ బ్రసాదించెను. ఈ ప్రపంచములో నసురత్వము నాఁగఁజాలు మహాశక్తి దైవీశక్తియైన సత్యాగ్రహ మొకటే యనియు నయ్యది యీశ్వర వరప్రసాద మనియు నుద్ఘాటించెను. అట్టి సత్యాగ్రహమునకు బ్రహ్మచర్యము ప్రాతిపదిక. బ్రహ్మచర్యమున కింద్రియనిగ్రహ మత్యంత ప్రధానము. అందును జిహ్వానిరోధము ముఖ్యము. భోజనము స్వల్పముగను వాసనాద్రవ్య రహితముగను, నపక్వముగను నుండవలెను. స్వాదు ఫలాహారమైన మిన్న. ఉపవాసదీక్ష సాహాయ్యకారి. త్రికరణ శుద్ధిగా సకల విషయ వాంఛల నరికట్టిన సదాచారియైన బ్రహ్మచారికి నజేయంబేదియు లేదని ప్రబోధించెను.

బోయరు యుద్ధానంతరము గాంధీ గృహోన్ముఖుఁ డాయెను. దక్షిణాఫ్రికాలోని భారతీయులందఱును దమకెచ్చోట నెప్పుడవసరమైన నప్పుడరుదెంచి సాయపడెదనని యా మహాత్మునిచే నభయ హస్తము వడసి, విడువలేక విడువలేక విడుచుట కంగీకరించిరి. వారా గాంధీని దమ ప్రేమామృత ధారలలోఁ దడిపివేసిరి. నానా సూన కనత్కనక రత్నాంచిత భూషలను గానుకలుగాఁ దెచ్చి సమర్పించిరి. అమూల్యంబైన యొక సువర్ణ రత్నహారమును గస్తూరిభాకు సమర్పించిరి. ఆ రాత్రి గాంధీ కంటికిఁ గూర్కు రాలేదు. తన

సంతానమునకును, వారి ద్వారా సర్వప్రపంచమునకును మానవసేవయే మాధవసేవ యనియు, సేవకు సేవయే ప్రతి ఫలంబనియుఁ బ్రకటింపవలసియుండ నాయాభరణముల నెట్లు గ్రహించుట! భార్యయుఁ, బిల్లలును మహాత్ముని యపార కృపారసామృత వృష్టిచేఁ గాంచన వ్యామోహ మూర్ఛ నుండి తేరి ప్రజాసేవకుఁడు విలువగల బహూకృతుల స్వీక రింపఁ గూడదను విజ్ఞాన సూత్రమునందలి యర్థమును బరి పూర్ణముగా గ్రహించిరి. ఆ ధనమంతయు నచ్చటి భారత ప్రజానీకము సాహాయ్యార్థ ముపకరించుటకు ట్రస్టీల కప్పగింపఁ బడెను.

గాంధీజీ దక్షిణాఫ్రికా విడిచి భారతదేశము చేరెను. పర పరిపాలన దౌర్భాగ్యమున దేశమంతయుఁ గ్రుంగి కృశించి పోయిన రోజులవి. ఆఁకలి మంటచే నటమటలాడు పిల్లలఁ గాంచి బాధపడు తండ్రివలె 'బాపూజీ' భారతీయుల దుస్థితికి దురపిల్లెను. నిత్య నూతనమైన పురాణ మార్గమున శత్రు సందోహమును జయించి దాస్యశృంఖలలఁ ద్రెంచుకొని స్వతంత్రు లగుటకుఁ బ్రజల కవకాశము గల్పింప నెంచియే తదాహవ విజయ సంసిద్ధికై శాంతి సైనిక వీరశిక్షణార్థ మొక యాశ్రమము స్థాపింపఁ దలంచెను. గుజరాతునకు ముఖ్య పట్టణమైన యహమ్మదాబాదు నగరమునకు రెండు మైళ్ల దూరములోఁ బరిసరప్రాంతములలోని పాంథ జనము లకు స్వాదు జలము లొసంగి శ్రమ నివారించుచు సబర్మతీ స్రవంతి ప్రవహించుచుండును. మున్ను దధీచి లోకోపకా

రార్థము నిజదేహమును మహాత్యాగ మొనర్చిన పుణ్యస్థల మది. అట్టి పరమ పవిత్ర ప్రదేశమున సత్యాగ్రహాశ్రమము ప్రప్రథమమున గాంధీజీ నెలకొల్పెను. ఆశ్రమజీవిత పరమావధి పరమసత్యమునం దనంత భక్తి విశ్వాసములు కలిగి యుండుటయే; ఆశ్రమ నిత్యకర్మ సత్యాన్వేషణమే. సబర్మతీ ఆశ్రమ నియమావళిలో వినమ్రత విషయము ప్రత్యేకము చెప్పఁబడియుండలేదని సుహృదయు లెవరో సూచింపఁగా గాంధీజీ నేను నమ్రత కలిగియుందునని ప్రత్యేక శపథము గైకొనుట యావశ్యకమైన నది నమ్రత కాదనియు, నమ్రత యనఁగా నహంకార మడఁచుకొనుటయే యనియు, నదియే మోక్ష మనఁబడుననియు, నమ్రతారహితమైన సేవ స్వార్థ పరత్వమును, నహంభావమును సూచించుననియు, వినయము స్వతస్సిద్ధమైన నిర్దాంభిక సేవాభిలాషచే లభించునని యును ప్రబోధించెను. ఆశ్రమములో హరిజన కుటుంబము కూడ నుండెడిది. అందఱును గలిసి పని చేయవలెను; న్యూనతాధిక్యములు, గౌరవాగౌరవములు ననునవి పని పట్ల లేవు. మఱుఁగు దొడ్డి శుభ్రపఱచుటయును వారే చేసి కొనవలయు. అందఱును గలసి యేక పంక్తినే భుజించెదరు. జాతి మత వర్ణభేదము లా సార్వజనీన కుటుంబమున నసదు. కొంత కాలమున కా జాతీయ వీరసైనిక శిక్షణాలయము కారణాంతరమున వార్ధాకు మార్చఁబడెను.

స్వాతంత్ర్య సమర సన్నాహములో చంపారన్ మొదలైన సత్యాగ్రహములు వివిధ సోపానములు. చంపా

రణ్యము జనక మహారాజు రాజ్యములోని ప్రదేశము. ఆనాఁడది నానావిధ రసాల విటపి వనములతోడను, నీలిమందు చెట్లతోడను నిండి యుండెడివి. ప్రభుత్వమువారి పరిపాలన నిబంధనల దౌర్జన్యము వలన నచ్చటి ప్రతికర్షకుఁడును వీత హర్షుఁడై త్రివింశన్మాత్రము తప్పనిసరిగా నీలిమందు పండించి తీరవలయును. ఈ 'తీన్ కఠియా' పద్ధతి తొలగింప వలెనని గాంధీజీ నిశ్చయించుకొనెను. లాకోర్టులలో నీ బీద రైతులకు న్యాయము దొరకదనియును. సత్యాగ్రహ సమరమే దానికి సరియైన మందనియు నచ్చజెప్పి బీహారు న్యాయ వాది సహోదర సాహాయ్య మర్థించి రైతువర్గపుఁ గడగండ్ల సంపుటీకరింపఁ దలంచి ముందుగా భూస్వాముల సమాధాన మెఱుఁగఁ దలంచి కమీషనరునకు గలసి మాట్లాడుట కవ కాశ మీయవలసినదని కోరుచు గాంధీజీ వ్రాసెను. సంఘ కార్యదర్శి గాంధీజీ ననవసర ప్రసంగమని తూలనాడెను. కమి షనరు వెంటనే 'తిరుహూత్' విడిచి వెళ్లుమని యుపదేశ వాక్యముల జడిపించెను. చంపారన్ జిల్లాకు మోతిహారి ప్రధాన పట్టణము. అట కైదు మైళ్ళ దూరములో నున్న యొక గ్రామములోని సేద్యకాఁడొకఁడు పంటదారుల యల దడికిఁ బాలాయెనన్న వార్త గాంధీజీ చెవులఁ బడెను. వెంటనే గాంధీజీ సహచరులతో నచ్చటికిఁ బ్రయాణించెను. మధ్యేమార్గమునఁ బోలీసు సూపరింటెండెంటు వద్దనుండి యొక వార్తాహరుఁ డొక తాఖీదు పట్టుకొని వచ్చి గాంధీజీని గలసికొని దాని నందించెను. తత్క్షణము చంపారణ్యము

విడిచి పోవలెనని యందుండెను. నోటీసు నందుకొని, తా నందుకుఁ దయారు కాలేవనియుఁ, దాను గావింపఁబోవు కర్షక దుస్థితి కారణ విచారణ పూర్తి కాకుండఁ దా నచ్చోటు విడిచి చన ననియు నిష్కర్షగా వ్రాసి పంప, గాంధీజీ మరు నాఁడు కోర్టులో నాజ్ఞాతిక్రమనేరస్థునిగా విచారింపఁబడును గావునఁ దప్పక రావలెనని ప్రభుత్వ మాజ్ఞాపించెను. ఈ వార్త దవానలంబు చందమున నతిత్వరితముగా సర్వత్ర వ్యాపించెను. మరునాఁడు గాంధీజీ న్యాయస్థానము చేరు టకు మార్గము లభింపనంతగాఁ బ్రజ లనంతముగా గుమి కూడిరి. ఇసుక వేసిన రాలనట్లుండెను. గాంధీజీ కేవలము సత్యాగ్రహ దీక్షితుఁడే గాని తమ్మవమానపఱుప నిచ్ఛించు వాఁడు కాఁడని యెఱింగిన కలెక్టరు, మేజస్ట్రేటు, పోలీసు సూపరింటెండెంట్లు మిత్రత్వమునే ప్రకటించిరి. అచ్చటి కరు దెంచిన ప్రజానీకమునకుఁ బ్రభుత్వమనినను, బ్రభుత్వోద్యోగు లనినను భయము లేకుండఁ బోయెను. నిర్భయులైన ప్రజ లను రక్షకభటు లాఁగలేక శ్రమపడు సమయమున గాంధీజీ ప్రేమపూరితములైన తన యనునయంపు మాటల వారిని సమాధాన పఱిచెను. గాంధీ మహాత్ముని నవధర్మ ప్రబోధ ప్రభావ మందఱకు నవగత మాయెను. కేసు విచారణకు గడువుపెట్టఁ దలంచుకొనిన మేజస్ట్రేటు నేర మొప్పుకొను చున్న గాంధిజీ చర్యచూచి చకితుఁడాయెను. కర్షక వర్గపక్ష మున వారి దుస్థితి కారణము లారసి వారి కపవర్గ మార్గము బోధింపవచ్చిన తన్ను ప్రభుత్వ మన్యథాతలఁచి దోషిగా

భావించె ననియు, భూతదయ దక్క నన్యదుశ్చింత తన మనస్సున లేదనియు, లౌకిక ప్రభుత్వ పరిపాలనానియమ ముల కతీతమైన పారలౌకిక ధర్మావలంబిత మనస్సాక్షిగాఁ దా నొనరింపఁ బూనిన కార్యము నసంపూర్ణముగ విడిచి పెట్ట నీయదనియు గాంధీజీ యుపన్యసింప మేజస్ట్రేటితికర్తవ్యతా మూఢుఁడై, తీర్పునకు వాయిదా వేసెను. చివరకు రాష్ట్రాధిపతి యాజ్ఞపై గాంధీజీపై నారోపింపఁబడిన నేరము విచారింపఁబడకయే రద్దు చేయఁబడెను. అంతియే కాక గాంధీజీ చేయఁదలచిన విచారణ కవకాశము గల్పింపఁ బడెను. విచారణ స్వల్పకాలములోఁ బూర్తి యగునది కాదు. గాంధీజీ యాగ్రామప్రజల దుస్థితి కెంతయు వగచి, తద్దురవస్థానివారణమునకై నిర్మాణ కార్యక్రమ మమలులోఁ బెట్టించెను. సేవాదళ దత్తవైద్య విద్యాసాహాయ్యముచే నచ్చోటి కార్మిక జన హృదయము లాకర్షింపఁబడెను. ఇంతలో విచారణ నిమిత్త మొక సంఘ మేర్పఱుపఁబడుటయు, నా సంఘము విచారణానంతరము దోషము భూస్వాముల దనియును, రైతుల కన్యాయముగా వసూలు చేయఁబడిన సొమ్ము వాపసు చేయబడవలె ననియును, 'తీన్ కఠియా' పద్ధతి నిర్మూలింపఁ బడవలెననియు నేకగ్రీవముగా నభిప్రాయ మొసఁగి పంటదారుల దుర్ణయము లంత మొందించి, రైతు వర్గము నీలిమందు మచ్చ గడిగి వైచెను.

ఈ సత్యాగ్రహ సాధనమే స్వారాజ్య సంపాదనము గావించిన తిరుగు లేని బ్రహ్మాస్త్రము. ఖేడా సత్యా

గ్రహము, ఖిలాఫత్ సత్యాగ్రహముల యనంతరము రౌలత్ శాసనము సందర్భమున నొక సత్యాగ్రహ సంఘము స్థాపింపఁబడెను. ఏప్రిల్ 6–వ తేదీని యావద్భారత దేశమునందును శాంతియుతమైన హరతాళములు జరుపఁబడెను. వివిధ స్థలములలోఁ బ్రజ లసంఖ్యాకు లుపవాసములతోఁ బ్రార్థనలు సలిపిరి. దేశమందంతటను నూతన శాసనమునందు తమ యుదాసీనత వెల్లుగఁ బ్రకటించిన ప్రజలను గాంచి పరప్రభుత్వ ముఱక్రోధాపహృత వివేకమై కాల్పులకుఁ గడంగెను. అసహాయులైన యమాయక ప్రజలను శతఘ్నులచే భస్మీభూతులఁ జేసిరి. అమృతసరస్సులోని జలియన్వాలాబాగ్‌లో నిరాయుధులై శాంత మూర్తులై చేరియున్న నాల్గు వందల మంది ప్రజల నా తోఁటకుఁ గల యొకే యొక ద్వారమును మూయించి, డయ్యరు ప్రభువు తుపాకులతోఁ గాల్పించి చంపించెను. మఱి వేయికి పైఁబడి దిట్టమైన దెబ్బలు తినిరి. ప్రభుత్వవ్యాఘ్రము దారుణ లోహ నఖభీకర హస్తమును విప్పి చెలరేఁగెను. ప్రాకుడు చట్టములు, కొరడా దెబ్బలు, మానభంగములు, మఱువ రాని యాసుర పరిపాలనము ప్రజలను బీభత్సపఱచి వేసెను. ఈ ప్రభుత్వ చర్యయే 1920 ఆగష్టులో రూపొందిన శాంతియుత సహాయ నిరాకరణోద్యమమునకు బీజమాయెను.

నాఁటినుండి 1930 వఱకు గాంధీజీ దేశమును నిర్మాణ కార్యక్రమములోఁ గొంత శిక్షితముఁ గావించెను. దేశపరిస్థితుల నారసి, రాజకీయ స్వాతంత్ర్య మెంతవఱకుఁ

ప్రసాదింపవలయు నను విషయ నిర్ణయమున కాంగ్లపార్ల మెంటు 'సైమన్ కమిషను'ను బంపిరి. అందఱును తెల్లదొరలే కాని, భారతీయుఁ డొకఁడును లేఁడు. అట్టిది మన కెట్లుపకరించును? సైమన్ కమిషను బహిష్కరింపఁ బడెను. గాంధీజీ యాజమాన్యమున శాసనోల్లంఘనము నకు దేశము సంసిద్ధ మాయెను. గాంధీజీ ఉప్పు సత్యాగ్రహ మంత్ర ముచ్చరించెను. దేశమంతయు నామంత్రముచే మాఱు మ్రోఁగెను. నాఁటి వైస్రాయి కొక లేఖ లిఖించి యాతఁడు శాంతిసమరమునకు సన్నద్ధుఁ డాయెను. దేశ స్వాతంత్ర్యార్థము దండెత్తిన భారత సేనకు సేనాని మహాత్ముఁడు ; ఆయుధము శాంతియుతమైన శాసనోల్లంఘన మను కఱకుటమ్మును వెదజిమ్ము సత్యాగ్రహ మను విల్లు ; దాని గుణము నవధర్మమైన విశ్వప్రేమ. గాంధీ మహాత్ముఁడు 'సబర్మతీ' ఆశ్రమము వదలి రెండు వందల మైళ్ళ దూరములో నున్న 'దండి'కిఁ బ్రయాణ మాయెను. సకాలమున గమ్యస్థానముఁ జేరి నిర్ణీత సమయమున గుప్పెఁడుప్పును ప్రభుత్వ లవణకేదారములనుండి గ్రహించి శాసనోల్లంఘన మొనరించెను. అదే సమయమున యావద్భారతమున శత కోటి ప్రదేశములలో నుప్పు సత్యాగ్రహము సాగెను. ఒక నెల దినములా మహాత్ముని దిక్కు ప్రభుత్వము చూడ సాహసింప లేదు. ప్రభుత్వమువారి లైసెన్సుపై గీయబడు తాటిచెట్లను నఱకు కల్లు సత్యాగ్రహ ముప్పు సత్యాగ్రహమునకుఁదోడాయెను. పెషావరు, చెన్నపట్టణములలోఁదుపాకి

కాల్పులు జరిగెను. రత్నగిరి, పాట్నా, కలకత్తా మొదలగు నగరములలోఁ బోలీసులు చెప్పరాని యమానుష కృత్యములఁ జేసిరి. గాంధీజీని ప్రభుత్వము వారు కారాగార బంధితునిఁ గావించిరి. 'దర్శన' సత్యాగ్రహమున శాంతి సైనికులు మన దేశ చరిత్రములో నమూల్యమైన నిజరక్తా ఛురముల నవ్యకావ్యరీతు లుపచరించిరి. స్మారకము తప్పి పడిపోవు వఱకును నిర్దాక్షిణ్యముగాఁ జావఁగొట్టిన లాఠీ దెబ్బలఁ జూచి విదేశీయులే నిశ్చేష్టులైరి. చివరకు ప్రభుత్వము చేయునది లేక, లండనులో 'రౌండు టేబిల్ సమావేశ' మను మిషచే గాంధీజీని విడుదల చేసి, కాంగ్రెస్సుతో రాజీకి రావలసి వచ్చెను. 'గాంధీ–ఇర్విన్' ఒడంబడిక భారత దేశమునకు రాజకీయ స్వాతంత్ర్యమును గొని రా కున్నను, గాంగ్రెస్సునకు, మహాత్ముని నవధర్మమునకు నద్వితీయ నైతిక విజయ లాంఛనముగాఁ బ్రకాశించెను.

మహాత్మునికి భారత దేశ దాస్యవిముక్తి సంపాదనమే జీవితములోని ప్రధాన విషయము గాదు. ప్రపంచములో నష్టమైన ధర్మము నుద్ధరించి సత్యాన్వేషణము ప్రపంచము నకు బోధించి, యేకము, నిత్యము, నద్వితీయము నైన పర సత్య మెఱుంగు మార్గము నవధర్మ మార్గ మొక్కటియే యని ప్రబోధించుట కవతరించిన యా యోగీశ్వరేశ్వరుఁ డెల్ల చిన్న విషయములలో నిజప్రతిపాదిత నవధర్మాను గుణములైన సాధన సంపత్తినే సేకరించి ప్రకటించెను. అట్టి విజయ సాధనములలో బ్రహ్మాస్త్రము సత్యాగ్రహము. ఇది

యమోఘము. సత్యాహింసలను ప్రమాణముగాఁ గలిగిన మహా వటవృక్ష మయ్యెది. దాని యసంఖ్యాకములైన శాఖలలో శాసనోల్లంఘన మొక్కటి. దాని ప్రభావము నాసహస్ర ఫణాలంకృతుఁడైన యాదిశేషుఁడును వర్ణింపఁజాలఁడు. సత్యాగ్రహ బాణమును బ్రయోగించు వీరధ్వని సమస్త కష్టముల నోర్చి స్వార్థము నిరసించి పరుల యుత్కృష్టాభివృద్ధికిఁ బ్రాణ త్యాగమైనఁ జేయ సంసిద్ధుఁడై యుండును. అట్టివానికెన్నఁడు నపజయ మన్న మాట గానరాదు. శాంతముతో నచ్చఁ జెప్పియో, ప్రేమచే హృదయమును మార్చియో ఆత్మశిక్ష ణము, ఆత్మనిగ్రహము, ఆత్మశౌచము మున్నగువానివలన లభించిన యద్వితీయానంతాత్మశక్తిచే నతఁడు శత్రులోక మును మిత్రులుగా మార్చివేయును. ఇది మహాత్ముని నవ ధర్మసిద్ధాంతములోని సత్యాగ్రహ సాధన రహస్యము. ఈ సత్యాగ్రహ సాధనము నపూర్వ మహోద్యమమున నుపయో గించు సమయ మాసన్న మాయెను. రెండవ ప్రపంచ యుద్ధము ప్రారంభ మాయెను. పాశ్చాత్య రాజకీయ చరి త్రను బరిశీలించిన నెవరికి వారు సామ్రాజ్య సంపాదనో ద్యోగ సంరంభులై పరరాజ్యకబళనోద్ధతి నపజయభీతి నధికార సామ్య సిద్ధాంతము ప్రతిపాదించుట సువ్యక్త మగును. ప్రతి ప్రభుత్వము తా మతిధర్మపరులైనట్లును, దమ ప్రతిస్పర్ధి ధర్మబాహ్యుఁ డనియు, నియంత యనియు. నాసుర ప్రభువనియుఁ బ్రగల్భము లాడుట యాచారము. హిట్లరు యుద్ధము ప్రారంభించినంతనే ప్రపంచ ప్రభుత్వము

లిరుపక్షములుగాఁ జీలిపోయెను. వారందఱు ఫాసిస్టులు, నాజీలు నఁట! వీరు ప్రపంచశాంతిఁ గాంక్షించు మిత్రమండలి యఁట! ప్రపంచ జనసంఖ్యలో నైదవ వంతుగాఁ బరఁగు సుమారు మూఁడు వందల యేబది మిలియనుల భారతీయులను బానిసలుగాఁ దమ యినుప మడమలతోఁ ద్రొక్కి పెట్టిన బ్రిటిష్ ప్రభుత్వము మిత్రమండలిలోని ముఖ్య సభ్యుఁడు గాకపోయిన మఱెవ్వరగుదురు! ఇన్ని సంవత్సరములనుండి స్వాతంత్ర్య సమర మొనర్చుచున్నను భారతీయులఁ దృణీకరించిన ప్రభుత్వము నిజ సమర సన్నాహములోఁ బాల్గొన లేదని ప్రతి స్వతంత్ర పిపాసువును గారాగారబద్ధునిఁ జేసి, లాఠీదెబ్బలు కొట్టి, దేశము నిర్వీర్యముఁ గావింపఁ బ్రయత్నించెను. ఈ సమయమున మహాత్ముఁడు వ్యక్తిగత సత్యాగ్రహమును మాత్రమే ప్రతిపాదించెను. శత్రువులు క్లిష్ట పరిస్థితిలో నుండు సమయమున, వారిని జయించు కాంక్షతో, నా సమయమును బురస్కరించుకొని చెలరేఁగుట యుదార పురుష లక్షణము కాదనియు, భారత భూమి నట్టి యధర్మ మసంభవ మనియు, నీ ప్రపంచ యుద్ధము వ్యక్తిగత లాభాపేక్షపై నాధారపడి యున్నదే కాని పీడిత ప్రజానీకమునకు శాంతి సౌఖ్యముల నొసంగునది కాదనియు, దానితోఁ దమ కేమాత్రమును సంబంధము లేదనియు నుద్ఘాటించెను. వ్యక్తిగత సత్యాగ్రహము బధిర శంఖారావమాయెను. క్రిప్సు రాయబారమును నిరర్థక మాయెను. యుద్ధము ముదురుచుండెను. ఇంక వేచియుండుట

మూర్ఖత్వమని నిర్ధారణ మాయెను. ఆగష్టు సత్యాగ్రహము ప్రారంభింపఁబడెను. నాయకు లందఱును బంధితులైరి. ప్రజలలో రేకెత్తిన రాజకీయ చైతన్యము, స్వాతంత్ర్య పిపాస గట్లు తెగి వెల్లివిరిసెను. ప్రపంచయుద్ధము ముగిసి ఇంగ్లాండులో లేబరు ప్రభుత్వము 'అట్లీ' నాయకత్వమునఁ బదవిలోనికి వచ్చెను. బ్రిటీష్ వారికి వివేకోదయ మాయెను. భారత దేశమునకు స్వాతంత్ర్యము లభించెను.

మహాత్ముని జీవితమును మూఁడు ముఖ్య దశలుగా విభజింప వచ్చును. పుట్టిన దాది దక్షిణాఫ్రికానుండి తిరిగి భారత దేశమున కరుదెంచు పర్యంత మొకటి; ఇది సాధన దశ. భారత దేశమునకు స్వాతంత్ర్యము సంపాదించునంత వఱకు రెండవది. ఈసమయమున ముఖ్యముగా మన దేశమునకును, తద్ద్వారా ప్రంచమునకును సత్యాగ్రహ మమోఘైకైక సాధనముగాఁ బరిణమించినది, చివరది నవఖాలీ, కలకత్తా, ఢిల్లీల పర్యటన మూలమున నిజ నవధర్మ పీయూష బిందువులను విశ్వ సౌభ్రాత్ర ప్రాదుర్భావమునకై లోకమందంతట వెదజల్లిన కాలము. ఈ భారతపిత, జగజ్జ్యోతి, యవతార పురుషుఁడు లోకసంగ్రహార్థము మాయామానుష రూపము ధరించి గావించిన చర్య లనన్య సామాన్యములు; ప్రబోధించిన మార్గములు వేదోక్త ముక్తి పథములు; జీవిత సంఘటన లానందామృత బిందువులఁ జిందు భారతీయ సనాతన సంస్కృతి నిధానములు.

మహాత్ముని ప్రవచనములు నిగమసదృశములు. వేదోపనిషత్ప్రతిపాదకమైన సనాతన హిందూ మతము సర్వోత్కృష్టమైనదనియుఁ, దాను వేదములనినను, నుపనిషత్తులనినను, బురాణములనినను, అవతారములనినను, విశ్వాసము కలవాఁడ ననియు, వర్ణాశ్రమ ధర్మము వైదికంబే యనియు గోపూజ సర్వశ్రేయస్కరంబనియు, సగుణోపాసనమునందు దోషము లేదనియుఁ జెప్పి యాతఁడు గీతయే తన జీవిత రహస్యమని ప్రకటించెను. ఒకప్పుడు మహాత్ముఁడు, రవీంద్ర కవీంద్రుఁడు 'ఫెష' రను నమెరికా దేశపు మతగురువును గలసి ప్రసంగించు సందర్భమున విగ్రహారాధన విషయము ప్రసక్తము కాఁగా మహాత్ముఁడు హరిజన దుస్థితిని దలంచి యుత్తేజిత హృదయముతో ఆ చెట్టు నీడను జేగురు పూసిన యా శిలావిగ్రహమే తిండి లేక మలమల మాడు మాలవాని భగవంతుఁడు కదా! వానికిని, ననంతుఁడు, నాద్యుఁడు, నిర్గుణుఁడు నైన యా పరమాత్మకును మధ్యఁ గల యేకైక సంబంధము త్రుంపివేయఁ బ్రయత్నించుట యసందర్భ' మని వచించెను, గురుదేవుఁడు జ్ఞానయోగి; విగ్రహారాధన నెన్నిన సహింపడు. ఆ వాదము నతఁడతినిశితముగా ఖండించెను. 'దేశములోని నానా విగ్రహముల నా మహాజలనిధి గర్భమునఁ బడవేసి యావద్భారతమును బవిత్ర మొనరింప వలె' నని చెప్పెను. ఒక నిముసము గంభీర నిశ్శబ్దము ; పిమ్మట నతి ప్రశాంతము, నతి గంభీరము నైన హృదయ నిర్గత వాక్కులతో మహాత్ముఁడు 'పంగువునకు

నడక నేర్పనిదే చంకలో నున్న కట్ట చూడఁబెట్టుకుట యధర్మము. ముందుగా వాని కది నేర్పు బాధ్యత మన యందున్న'దని హెచ్చరించెను. హిందూ మతసార 'మహింసా పరమో ధర్మ' యని గానించు సత్యాన్వేషణమే యని చెప్పెను. అట్టి నిరవధిక సత్యాన్వేషణము నేఁడు కృశించి, చైతన్య రహితమై క్షీణించి యుండుటకు మన మనోభౌతికదుర్బలత్వమే కారణమనియు, నచిరకాలములో నా దౌర్బల్య మధిగమింపఁ బడిన వెంటనే హిందూమత మపూర్వ తేజఃస్ఫూర్తితో సర్వప్రపంచమును సమ్మోహన మొనరించివైచుననియుఁ బ్రకటించెను.

'మానవుఁడు తన నిత్యజీవితములో యమనియమముల రెంటిని మఱవరాని ముఖ్య విధులుగా గ్రహింపవలెను. సత్యాన్వేషణము యొక్క యూరముగ్గిన ఫలమే అహింస. అహింసయే సత్యహృదయము. అహింసాప్రాప్తికి బ్రహ్మచర్యము, అస్తేయము, అపరిగ్రహము ననునవి ముఖ్య సాధనములు. అహింసయే మోక్షము; మోక్షమనఁగా సత్యము నెఱుంగుట. గీత హింసాభయములనుండి పైకిఁ దీసి మానవునకు మోక్షమిప్పించు నుత్తమ గ్రంథరాజము. హృదయమునందు జనించు కార్పణ్యదోషమును దొలఁగించి, చిత్తశుద్ధి గలిగించి, ఆత్మశక్తి నొసంగు మంత్రమే గీత. గీతయందు శ్రద్ధా భక్తులు కలిగినవాఁడు హిందూ మహమ్మదీయ భేదభావము విసర్జించి ద్వంద్వాతీతుఁడై పరఁగును కాని తోడి మానవుల ద్వేషింపఁజాలఁడు. విశ్వప్రేమయే పరమా

వధిగాఁ గల కర్మఫల సన్యాసమే, అనాసక్తి యోగమే గీతా రహస్యము' అని మహాత్ముఁడు గీతా ప్రబోధము గావించెను. మహాత్ముని ప్రబోధ మహావాక్యములలో దొరలని మానవ సంబంధ విషయమే లేదు. హిందూ మతౌత్కృష్ట్య చర్యలో నతఁడు వర్ణాశ్రమ ధర్మ ప్రాశస్త్యమును సహేతుకముగాఁ బ్రతిపాదించెను. వర్ణాశ్రమ ధర్మము నిరహంకారతను సూచించును. వంశ పారంపర్యముగా వచ్చు కుల వృత్తినే జీవనోపాధిగా గ్రహించి, నైతిక పథము విసర్జింపక మనుటయే వర్ణాశ్రమధర్మ మనియు, భగవంతుని సమస్త సృష్టిలోను మానవుఁ డొక్కఁడే తన సృష్టికర్త నెఱుంగఁ దలంపు కలిగి ప్రవర్తించు వాఁడనియు. నీ వర్ణాశ్రమ ధర్మ మార్గము ప్రాపంచిక సౌఖ్యములనుండి విముఖత్వము కలిగించి పరమేశ్వరు నెఱింగెడు విజ్ఞానముఁ బ్రసాదించుననియుఁ జెప్పెను. నేఁటికాలపు టజ్ఞులు కొందఱీ మర్మమెఱుంగక వర్ణాశ్రమమనిన నాధునిక కులతత్వమేయని యర్థము చెప్పు కొనుచు సనాతన హిందూమతమును దూషించెదరనియు, నది సరికాదనియు దిద్దిచెప్పెను. ఆర్షప్రోక్తమైన చాతుర్వర్ణ్యప్రాశస్త్యము నుగ్గడించుచు, నది 'న్యూటన్' మహాశయుని విశ్వాకర్షణ సిద్ధాంతమువలెఁ బ్రతిపాదితముకాక పూర్వమునుండియు ననాదిగా వచ్చుచుండిన మహత్తర ధర్మమనియు. నది హిందూ క్రైస్తవ మహమ్మదీయాది నానామతస్థులకు నత్యవసరమైన లౌకికనియమమనియుఁ జెప్పెను.

ఇంకొకచోట గోమాతయే ధర్మదేవతాస్వరూప మనియు, నదిహైందవ సంపత్తియనియు, దాని నేనాఁడవజ్ఞ చేసితిమో యానాఁటినుండియే ప్రపంచపతనము ప్రారంభ మనియు, గోసేవ సకలప్రాణిసమానత్వమును, నహింసాతత్వ మును బ్రతిపాదించి మోక్షము ప్రసాదించుననియుఁజెప్పెను. మఱియొక తావునఁ జిత్తశుద్ధిగలిగిన భక్తుఁడు విషమావస్థ నెందియున్న సమయమున భగవంతుని నేకాగ్రచిత్తంబునఁ బూజించి ప్రార్థించిన నంతర్యామిగా నతని రక్షణ కరుగు దెంచుననియు, నా చిత్తశుద్ధికి, నా యేకాగ్రచిత్తతకు నుప వాసము ముఖ్యోపకరణమనియుఁ జెప్పెను. మహాత్ముఁ డంటని విషయము, ఈయని హిత బోధ, పలుకని సత్యము ఆచరింపని ధర్మములును లేవు. స్త్రీలకు విద్యార్థులకు, పిన్న లకుఁ బెద్దలఁకు బండితులకుఁ బామరులకు, దేశనాయకులకు లోకసేవకులకు నాతఁడమూల్యోపదేశ హితవాక్యములతో, బ్రబోధమొసంగెను. పంచములనియు, నంటరానివారనియు, మతబాహ్యులనియు వ్యవహరింపఁబడు చండాలుర హరి జనులుగా మార్చి, పతితపావనుఁడై పరఁగెను. మాలవారి నుద్ధరింప నీతఁడు పడిన శ్రమ మనంతము. దేశములోని సనాతనధర్మాచార పరాయణులైన హైందవ మతపండితులఁ బ్రతిఘటించి రాష్ట్రరాష్ట్రమున, నూరూరఁ బర్యటించి తన నవధర్మమంత్రోపదేశము భారతీయప్రజానీకమునకుఁ గావించి సభలలో నుపన్యసించి కోట్లకొలఁది సామ్రార్జించి హరి జనోద్ధరణార్థము వెచ్చించి, సవర్ణ హైందవ హృదయ పరి

వర్తనార్థ ముపవసించి యుపవసించి యాలయప్రవేశ భాగ్య సంధాయియై, చ్యుతోద్ధారకుఁడు, దరిద్రనారాయణుఁడు నని ప్రస్తుతిఁగాంచెను.

మహాత్మునిఁ జూడఁగలుగు భాగ్యము భగవానునితోఁ గలసి తిరుగు మహాభాగ్యమువలెఁ బూర్వజన్మమునఁ జేసిన పూజాపుణ్యఫలమేయని ప్రస్తుతింపనగును. అతని సహచరులయి తిరిగిన యదృష్టవంతులు ప్రచురించిన సంఘటన లెఱింగిన మహాత్ముని దివ్యమాహాత్మ్యము ద్యోతితమగును. కాకాసాహెబ్ కుమారుఁడు కలేల్కరు మహాశయుఁడు పాశ్చాత్యదేశములలోఁ బెద్ద విద్యలు గడించిన యింజనీయరు ; వైజ్ఞానిక శాస్త్రజ్ఞుఁడై భారతపౌరులు తమ మూఢవిశ్వాసములతో మన సంస్కృతి, నాగరకతలను విధ్వంసము గావించిరని విచారించు పండితుఁడు; మహాభీకరమైన బీహారు భూకంపము మన మొనర్చిన అస్పృశ్యతాఘమునకుఁ బ్రతిఫలముగా భగవంతుఁడు పంపిన యతి ఘోర శిక్ష యని మహాత్ముఁ డిచ్చు హెచ్చరిక నీసడించిన నవనాగరికుఁడు. అతఁడు రాజకోట సమస్యాసమయమున నుపవసించిన మహాత్మునికి సేవచేయుచుండెను. ప్రాంతీయ సమస్య అఖిలభారత సమస్యాస్వరూపముఁ దాల్చెను, మహాత్ముఁ డొనరించు దైనందిన ప్రార్థనోపన్యాసములకుఁ బ్రజలు లక్షలాదిగఁ, దండోపతండములుగ వచ్చుచుండిరి. అది సహింపలేని రాజోద్యోగులు దుండగీఁడ్రఁ బంపి యా సభలలో నల్లకల్లోల ముప్పతిల్లఁజేసి ప్రజల భయపెట్టఁదలం

చిరి. ఒకనాఁటి సభలోఁ బలువురు ముష్కరులు లాఠీలతోఁ బ్రత్యక్షమై, సభ్యుల నదలించుచు మహాత్ముని దిక్కునకు వచ్చుచుండిరి. కాంగ్రెస్ వలంటియర్లు హింసామార్గమున నాయలజడి మాన్పఁ బ్రయత్నించియు విఫలులైరి. ఇది తెలియని మహాత్ముఁడు ప్రార్థనానంతరము తన మోటారు సమీపించులోపున నాదుష్టు లామహాత్మునిఁ జుట్టుముట్టిరి. అప్పుడే ప్రజలలోఁ గలకలము పుట్టెను. కలేల్కరు మహాశయునకుఁ బ్రమాదము నిశ్చయమని తోఁచెను, అశాంతి హింసాస్వరూపము దాల్చుట నిశ్చయము; అది యంతటితో నాగక మహాత్ముని కపాయము నాపాదించుట తథ్యమని తొందరతొందరగా మహాత్మునియొద్దకుఁ జేరెను. ఇంతలో నప్పుడే సభలోని ప్రజలు గుంపులు గుంపులుగా దొమ్మి యుద్ధమునకు దొరకొనుచుండిరి. మహాత్ముని శరీర మాపాదమస్తకము కంపింపఁ బ్రారంభించెను. అది భయవిహ్వలత కాదు. సకలలోకాభయప్రదాయియైన మహాత్మునకు భయమా! కాదు కాని జరుగనున్న రాక్షసకృత్యమునకు, హింసాప్రమేయమునకు మహాత్ముని హృదయము చివికిపోవుచుండెను. ఆర్తరక్షకుడైన మహాత్ముని రక్షించు టెట్లని కలేల్కరు బాధపడుచుండెను. అకస్మాత్తుగా మహాత్ముఁడు నిమీలితలోచనుఁడై తారకమంత్రము జపించెను. కనులు విప్పి వలంటియర్లను, నాశ్రమబాలురను వెంటనే యాస్థలము విడిచిపొమ్మనెను. ఆనాఁడు తాను పాదచారియైకాని, మోటారులో రాననెను. వెంటనే యా దుర్జననాయకుని

దగ్గఱకుఁ బిలిచి, 'నీ కేమి కావలయును నాయనా! సందేహ నివృత్తికై నావాక్యా! అడుగు మే ప్రశ్నకైనఁ దగు సమా ధానమిచ్చి నచ్చఁజెప్పెదను. ఆత్మశాంతికై నాయీశరీ రమా! తీసికొనుము నిరభ్యంతరముగా. దీని కింత సంకోచ మేల! నీ యభీప్సిత మేమియో తెలుపు' మని నిశ్చల మన స్సుతో, పూర్ణ హృదయముతో, నానందతుందిల ముఖార విందముతో, ననునయభాషణములతో నాదరించి పలుక, నా హృదయములో నేమహాశక్తి కుంభీభూతమైయుండెనో, యా ప్రేమార్ద్రవాక్కులలో నేదివ్యమంత్ర మిమిడియుండెనో, ఆ దుండగీండ్రు ముగ్ధులైపోయిరి. వారి నాయకుఁడు మహాత్ముని ముందు నిటలతటము సోక కేలుదోయి మొగిడ్చి, తన యప రాధమున కాంతరంగిక వేదనఁ బొందుచు, 'నా భుజముపై కేలూదిదయచేయుఁడు; మీగమ్యస్థానమునకుఁ గొనిపోయెద' నని ప్రార్థించెను. స్వయంకృతాపరాధములకు నిజముగాఁ బశ్చాత్తాపమునొందువారిని భగవంతుఁడు సర్వథా సంర క్షించును. మహాత్ముఁడా సాయంసమయమున వాని భుజ ముపై చేయివైచుకొని కాలినడకఁ దన గమ్యస్థానముఁ జేరుటఁ జూచిన కలేల్కరాది యావత్ప్రజలును మహాత్ముని దివ్యశక్తికి నాశ్చర్యచకితులై మూకులై హృదయములలో నమోవాకము లర్పించిరి.

ఒక పర్యాయ మొక భక్తురాలు పాముల నేమిచేయ వలెనని గాంధీమహాత్మునిఁ బశ్నించెను. దానిపై నాతఁడు మనలోని విషయవాంఛాపన్నగములను దప్పక సంహరింప

వలెననియు, విషసర్పంబైనను మన మద్దాని కపాయం బాపాదింపనియెడల మనల నది హింసింపదనియు, నందుచే నంతరరిపుడ్వర్గమును జయించిన సాధువునకు భయ మనవసరమనియుఁ జెప్పెను. ఒకనాఁ డొక నాగసర్పము మహాత్ముని సమీపించి, నిజవదనజనితవిషదహనశిఖలు మెఱయఁ, దన నిడుద గొడలితో మహాత్మునిఁ బెనఁగొనియెను. క్షణకాల మాతఁడు జడుని భంగి చేష్టలు తక్కియుండి తారకమంత్రరాజోచ్చారణంబు సేయుచు, నియ్యది నన్గఱచినను నిరపాయంబుగా నిది రక్షింపఁబడునుగాక యని ధ్యానించు సమయమునఁ బరివృతబంధుజన మ్మాతనిఁ గనుంగొని తత్ప్రభావంబు నెఱుంగక 'దుర్మదంబున నీ భుజంగమంబు మన మహాత్ముని మేనఁజుట్టుకొని మానకయున్నది, కఱచునేమో' యని భయభ్రాంతులై హృదయార్తిం దూలిరి. అంతఁ గొంతవడి కాసర్పము మహాత్ముని స్కంధభాగం బారోహించి, కంఠమాలగా నమరి, మౌళిపైఁ దన విశాలఫణమ్మున సితాతపత్రమువట్టెను; మహాత్ముఁడు, ననాది మధ్యాంతయుఁడైన యాయహిభూషణుని సొంపునందనరెను. ఒక ముహూర్తమాత్ర మిట్లు జరిగినంతట నానాగంబు మెల్ల మెల్లగా మహాత్మహృదయనిర్గత ప్రేమాశీస్సులచే భవభయహరముగా నచ్చటు వాసి తిరోహితమాయెను. మర్నాఁ డీ విషయము వార్తాపత్రికాముఖమున యావద్భారతమున వ్యాపింపఁగా మహాత్ముఁడు భారతసమ్రాట్టగు శుభచిహ్నమది యని ప్రజలు సంతోషించిరి.

ఇంకొకపరి నొక మిత్రుని పుత్రునకు దృష్టిదోషము కలిగెను. అతఁడు ప్రాచ్యపాశ్చాత్య వైద్యశిరోమణుల కంట బడికిఁ జూపఁబడెను. వెళ్లవలసిన వైద్యశాలలకు వెళ్లిరి. యూరపులోని యాధునిక శాస్త్రవిజ్ఞానులుకూడ దృష్టిరాద నిరి. కాని యామిత్రుఁడు భక్తుఁడు; మహాత్ముని సునిశ్చల భక్తితో భజియించువాఁడు. మహాత్ముని యాశ్రమమునకుఁ దనకుమారునిఁ గొంపోయి. యా రాజీవనేత్రుని పాదపద్మము లాశ్రయించెను. లోకసంగ్రహార్థము తనవుదాల్చిన యా మహానుభావుని కింకొక యవకాశము లభించెను. మానవున కహంకార మనర్థదాయకమనియు, నిశ్చలభక్తితో భగ వంతునిఁ బ్రార్థించి భజియించువారి కతఁ డసంశయంబుగా నార్తిహరుఁడై తన్నైన నిచ్చుననియు నిదర్శింపనెంచి యా బాలకునిఁ దన యాశ్రమమున నుంచుకొని, కంటికి పుట్ట మున్న పట్టువేయుచు నహోరాత్రము లానేత్రరోగి తల్పమున నుండి పరంధాముని, భగవంతుని నిరవధికనిష్ఠతో ధ్యానించి ప్రార్థించి, చివరకు 'కనులుపోయెను, దృష్టిరా'దనిన గ్రుడ్డి బాలునకు దృష్టి ప్రసాదించెను. తరువాత నాబాలుఁడు పెద్ద చదువు లభ్యసించి గొప్ప డాక్టరాయెను.

మహాత్ముఁడు పొనరింపని ఘనకార్యము లేదు. హరి జనోద్ధరణముతో పాటు పానపిశాచమును బాఱఁద్రోలి దరిద్ర జనమునకు సౌఖ్యసంధాయి యాయెను. పాశ్చాత్యసిద్ధాంత సింధువులోఁ గమ్యూనిస్టు కల్లోలముచే ముంచివేయఁబడ నున్న సమయమున, శ్రామికవర్గమునకుఁ దన నవధర్మ

మార్గ ముపదేశించి విపత్పరంపరలనుండి సముద్ధరించి జీవిత శాంతి నొసంగెను.

కొందఱు గాంధీమహాత్ముని మహాత్ముఁడనిరి. కొందఱు రాజకీయవీరుఁ డనిరి. మఱికొందఱు హిందూమతప్రవక్త యనిరి, ఇంకను గొందఱు సామాన్య మానవసహజలోప భూయిష్ఠుఁడైన పురుషుడే యనిరి. మఱియును గొందఱు విప్లవకారుఁడనిరి. ఎవరేమన్నను, బురుషుఁడు నవధర్మమార్గ గామియై పురుషోత్తముఁడు కాఁగలఁడను గీతాప్రబోధ లక్షణ మునకుఁ దన జీవితము లక్ష్యమై తనరినవాఁడు మహాత్ముఁడు. ఎటువంటి క్లిష్టపరిస్థితిలోను గలఁతవారని స్థితప్రజ్ఞుఁడు. రాజకీయములలో సహితము ధర్మమార్గ మనవలంబనీయము కాదనియు, మానవునిపరమావధివలెనే తత్సాధనసంపత్తియు నుత్కృష్టమైనదై యుండవలెననియుఁ బ్రబోధించిన ప్రాచీన భారతసంస్కృతి స్వరూపమైన నవధర్మమూర్తి. అమెరికా దేశస్థులైన కొందఱు క్రైస్తవమతప్రబోధకు లీతఁడు జేసు నాథుని యపరావతార మనిరి. గాంధీజీ 1921 నాఁటికే మహాత్ముఁడని, భారతదేశమును లోకమంతయు నుద్ఘోషించి నవి. ప్రపంచమునం దింతటి పలుకుబడి గలిగిన వ్యక్తి 'నభూతో నభవిష్యతి'. ప్రజాప్రభువు, నుత్కృష్టావతార మూర్తియు నైన శ్రీరామచంద్రునకుఁగాని, శ్రీకృష్ణభగ వానునకుఁగాని, బుద్ధభగవానునకుఁగాని, యేసుక్రీస్తునకుఁ గాని యింతటి ప్రఖ్యాతియు, నింతటి పలుకుబడియు నుండి యుండలేదు. ఇట్టి లోకైకమహనీయతారహస్య మాతని

సాధుజీవితమం దిమిడియున్నది; ఆతని జీవితశిక్షణమునం దాగియున్నది; కష్టజీవుల జీవితకష్టమును బంచుకొనఁగల్గు టలోనున్నది; అతని త్యాగములో నున్నది. మానవుఁ డాత్మస్వాతంత్ర్యము నెఱింగి భగవద్భీతి గలిగియుండిన ప్రపంచములో మఱిదేనికిని నాతఁడు భయపడవలసిన యవసరము లేదని బోధించి మట్టిని బంగారముగా మార్చివేసెను. ఆనాఁడు శ్రీకృష్ణభగవానుఁడు రణరంగముననిల్చి కార్పణ్య దోషోపహతుఁడైన యొక భారతునకు గీతాబోధ మొనర్చెను; నేఁడీ గాంధీ భగవానుడు సమస్తభారతీయులకును, సకల ప్రపంచమునకును నేతద్గీతారహస్యమును దన జీవిత రహస్యముగాఁ జేసి యనుభవవేద్య మొనరించెను. కౌపీన ధారియై, సన్యాసియై, ద్వంద్వాతీతుఁడై, అరిషడ్వర్గము నాఁగి, మమకారమును ద్రుంచి, మానసేవయే మాధవ సేవయని యనాసక్తియోగమును లోకమునకుఁ బ్రబోధించిన యోగీశ్వరేశ్వరుఁడు. గాంధీమహాత్ముఁడు నవకాళీ కలకత్తా ఢిల్లీ సంఘటనలలోఁ దన నవధర్మప్రభావమును బ్రకటించి యిఁకఁ దన యవతారకార్యము నిర్వహింపఁబడె నని యవతారోపసంహారమునకు సమయము వేచియుండెను. నాలుగురోజుల ముందు తనపై బాంబు ప్రయోగించిన యువకు నతఁడు కృత్యాకృత్యవివేకహీనుఁడైన బాలకుఁ డనియు, నతని క్షమింపవలెననియుఁ బల్కి ప్రజాప్రభుత్వ శిక్షనుండి తప్పించి కాపాడెను. ద్వేషవిశీర్ణాత్ములైన ప్రజల కృపణత్వము తొలఁగింప నిరశనవ్రతము పూని యప్పుడే

ఉపవాసదీక్ష నుపసంహరించెను. ఇంకను శరీరమున నీరసము మిక్కుటముగా నుండెను. దివాకరు కెండల్కరు మొదలగు కొందఱు మిత్రులు కూర్చుండియుండిరి. ప్యారీలాల్జీ యప్పుడే లోనికివచ్చెను. ప్యారీలాల్జీని జూచుట తోడనే యే విస్మృతవిషయము స్మృతికివచ్చెనో కాని, దివాకరమహాశయుని, "యదువీరులందఱును మదిరాపానవివర్ధమాన మదసమ్మర్దోగ్రరోషాంధులై కృష్ణసమక్షముననే తమలోఁదాము కలహించి, నీలై, నష్టదశంజిక్క శ్రీకృష్ణుఁడేమి యొనర్చె" నని ప్రశ్నించెను. అంత దివాకరుం డిట్లని యెను: అట్లు వసుదేవుం డన్యాయప్రవర్తకులగు దుష్టుల సంహరించి, న్యాయప్రవర్తకులగు శిష్టులఁ బరిపాలనంబు చేసి, బలరామసమేతంబుగా ద్వారకానగరంబు వెడలినంగని యాదవులు తమలోఁదాము మదిరాపానమత్తులై, మత్సరంబున నుత్సాహకలహంబునకు గమకించి యొండొరులం దాఁకి ఖండనంబున నందఱుం బొలియుటకు నగి నగధరుండును, రాముండును జని చని యప్పరమేశ్వరుం డొక మార్గంబునం జని, యొక్క నికుంజపుంజంబు చాటున విశ్రమించుటం జేసి చరణంబు వేఱొక చరణంబుమీఁద సంఘటించి చంచలంబుగా వినోదంబు సలుపు సమయంబున నొక్క లుబ్ధకుండు మృగయార్థంబుగా వచ్చి, దిక్కులునిక్కి నిరీక్షించుచుండ వృక్షంబుచాటున నప్పరమపురుషుని చరణకమలంబు హరి కర్ణంబు గాఁబోలునని దానింగని శరంబు శరాసనంబునందు సంధానంబుచేసి యేసిన సరోజనేత్రుండు వానిం గరుణించి

'నీవు నిమిత్తమాత్రుండ, వింతియె' యని ప్రాయోపవిష్టుం డైనవానికి వైకుంఠపదంబొసంగి, తానును శతకోటి సూర్య దివ్యతేజోవిభాసితుండయి నిజపదంబున కరిగె." కథ సమస్తమును విని 'ఆహా! యట్లా!' అని, కాంగ్రెసువాదు లుద్యోగమదిరాపానమత్తులై జాతివైషమ్యమత్సరంబున నుత్సాహకలహంబునకు గమకించు ప్రజల దిద్ది సవరింపఁ జాలక, తమలోఁదాము కలహించి, మహనీయ దివ్య ప్రజా సేవాసంస్థయగు కాంగ్రెస్సును బొలియింపఁబోవుచున్నారు కదా యని విషాదమానసుఁడై పలికెను.

జనవరి 30, 1948 నాఁడు యథాప్రకారము సాయం కాలపుఁ బ్రార్థనసభకు మహాత్ముఁడు 5 గంటలకు బిర్లా భవనమువీడి సభామంటపమునకుఁ బోవుచుండెను; తన మనుమఁ రాండ్రిద్దఱి భుజములపై రెండుచేతుల నానించి నడచు చుండెను. ఇంతలో నొక యువకుఁడు. ముప్పది ముప్పది యైదువత్సరముల ప్రాయమువాడు, కాకీదుస్తులతోఁ గిరాత హృదయముతో జనసమ్మర్దమును దొలఁగించుకొనుచు ముందుకువచ్చి, యాలస్యకారణమునఁ దొందర తొందరగా ముందుసాగిపోవుచున్న మహాత్ముని మార్గమున కడ్డుగావచ్చి పాదములకుఁ బ్రణమిల్లి పాదధూళిని గనులకద్దుకొనఁబోవు చున్నవానివలెఁ గానంబడి యొక మనుమరాలు వారింప బోవఁగా నామెను ద్రోసివేసి, గుప్తాయుధమును బైకిఁదీసి, రివాల్వరుతో మహాత్ముని హృదయమే లక్ష్యముగా మూఁడు కాల్పులు కాల్చెను. మహాత్ముఁడును, 'ఇదంఖలు బ్రహ్మ'

మను వేదాంతరహస్యమును విశ్వసించువాఁడు గావున 'గాడ్సేకు' వినయవినమిత నమస్కారమొనర్చుచు, రామ తారకమంత్రరాజ ముచ్చరించుచు నవ్వురాజిల్లు మోముతో నేలకు వ్రాలి నిర్వాణపథమ్ముఁ జేరెను.

ఈ పరమయోగీంద్రుఁడు. పురాణపురుషుఁడు భౌతిక శరీరమును విసర్జించియుఁ దన దివ్యతేజస్సుతోఁ బదునాల్గు భువనములు నింపివేసిన జగజ్జ్యోతి. అతనికి నాఁడెల్లఁ జేతులై తనరఁ గేల్మోడ్చినతు లొనరించి, మహాత్మప్రసాదిత నవధర్మపథగాములమై తరింతుముగాక.

సీ॥ ఈ యుత్తమశ్లోకుఁ డెలమి జన్మింపంగ
  నఖిలప్రపంచంబు ననఘమయ్యె,
ఈ పుణ్యవర్తనుఁ డే ప్రొద్దు నుండంగ
  భారతమహిమంబు వసుధఁ బెరిగె,
ఈ పురుషశ్రేష్ఠు నీక్షించి భక్తితో
  దరిఁజేరి నరులెల్ల ధన్యులైరి,
ఈ నవధర్మి తా నెఱిఁగి బోధించిన
  యంతనే నిష్ఖేదమయ్యె జగము,

గీ॥ ఈ జగన్మహానాకృతి నీశివావ
తారమున్ వివశాత్ములై తనియఁగొలిచి
భక్తబృందమ్ము భవబంధభయము తొలఁచి
చూఱఁగొందురు మోక్షమ్ము సులభముగను ॥

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# 2. జేసు రక్షకుఁడు.

ఆనాఁడు గగన భాగమునఁ దూర్పు దిక్కుగా నొక వింతనక్షత్రము ద్యోతితమాయెను. పురాణపండితులైన మువ్వురుదైవజ్ఞు లా వింత నక్షత్రమునుదయమున విశేషార్థము గ్రహించినవారై హీరోద్ ప్రభువునుజేరి "రాజా! అనంతదివ్యప్రభల నీనుచుఁ దారాపథమున దేదీప్యమానమై విరాజిల్లుచున్న యా వింతనక్షత్రమును గాంచితివా! మన ప్రభువు, రాజాధిరాజు, దీనజనావనుఁడు, పతితపావనుఁడు లోకరక్షకుఁ డవతారముదాల్చెను. ఆ మహాత్ముని దివ్యరూపసందర్శనభాగ్యము మాకెక్కడ లభించునో దయచేసి తెలియఁజేయవే" యని ప్రార్థించిరి. అశనిపాతములై యీ మాటలు హీరోద్ హృదయకుహరమును బీభత్సమొనరించినవి. తన పదచ్యుతికి కారకుఁడైన దురంతహంత తాను భయపడినయట్లు నిజముగా ప్రభవించెనాయని వనటంగుందియు, లోనికుందు బహిర్గతముకానీనిధీరగంభీరవచస్సులతో, "దైవజ్ఞులారా! నేనును నాపుణ్యసమయమునకే యెదురుచూచుచుంటిని. మీ రా బెత్లేహేమునం దందందు వెతకి యాతని జన్మస్థానమారసి నా కెఱింగించిన మీకుఁ బుణ్యముండును. నేనుకూడఁబోయి యా మహాత్ముని సందర్శించి యానందమున నోలలాడుదు" నని పలికెను.

ఆ దైవజ్ఞు లంత నాచోటువీడి యా దివ్యనక్షత్రము తమకు దారిఁజూప పయనించి బెత్లేహేము నగరమం దొక



ఏసుప్రభువు.

పశువుల సాలదరిం జేరి, కన్యమరియమ్మ గర్భముక్తాఫల మును, సత్యవ్రతుని, నిత్యసంప్రాప్తిసాధనుఁ, గాలత్రయము నందుఁ గలుగువానిఁ, బూర్ణేందు రుచిజాలు, భక్తలోక పాలు, మాయాబాలుఁ దిలకించి, పులకించి, యుబ్బి, చెల రేఁగి, చాఁగిమ్రొక్కి లేచి నానావిధపరిమళ ద్రవ్యములతో నారాధించి స్తుతియించిరి. ఆ సమయంబున నశరీరవాణి వారిని హేరోదున కీవార్త గొంపోవలదని యాజ్ఞాపించు టయు వారును నాయాజ్ఞ శిరసావహించి నిజగృహమ్ముల కానంద కందళితహృదయములతోఁ జనిరి.

కాలవిలంబనమైనను దైవజ్ఞులు మగిడిరారైరి. హేరో దునకు భీతియు, రోషమును హృదయమున ముప్పిరిగొని కలంచివైచెను. తాను యూదులరాజై యుండ నింకొక యూదరాజు జనించుటయా! ఇది యసంభవము. కర్కశ హృదయులగు రక్కసులవంటి యనుచరుల రాఁబనిచి బెత్లె హేమ్‌నగరమునందలి కసుగందుల, చిన్నిబిడ్డల నందఱి మాయాబలదర్పంబున మట్టుపెట్టిరండని హేరోద్ పనిచెను. అటమున్న బెత్లెహేములో జోసెఫునకు స్వప్నమున నొక దేవదూత ప్రత్యక్షమై జేసుబాలకునిఁ దత్క్షణం బా నగరము నుండి పాలస్తినాకుఁ గొంపోవలసినదిగా నాజ్ఞాపించెను. బిడ్డను గరముల ఱొమ్మున నడ్డంబుగాఁబట్టి, పదము లల్లన వేయుచు జోసెఫుమరియమ్మలు రహస్యముగా నానగరంబు విడిచి చనిరి. వారిపోకడ యతి రహస్యంబగుట హేరోదు ననుచరు లెఱుంగక స్వామికార్యనిర్వహణ ధురంధరులై

యనుకంపవిడి చంటిపిల్లలనందఱ మాయాబలంబునఁ బరిమార్చిరి.

కొంతకాలమునకు హీరోదు కాలగతిఁజెందెను. వాని యనంతరము వాని కుమారుఁడు ఆర్చిలాస్ హీరోద్ సింహాసన మధిష్ఠించెను. ఆనాఁటి దేవదూతయే మరలఁ బ్రేరేపింప జోసెఫు దారపుత్రులతోఁ గలసి నాజరెత్తు జేరుకొనెను।

ఇంతకుమున్నే యెలిజబెత్తు జకారియాలకు వారి వృద్ధాప్యంబున వరప్రసాదుఁడై జనించిన జోహాను ఉష్ట్రకేశవస్త్రధారియై, నడ్డినొక తోలుత్రాట బంధించుకొని, నిర్జితాఖిలేంద్రియుండైన సన్యాసియై జోర్డాన్ ప్రాంతమున, "మన మిప్పు డీశ్వరసామ్రాజ్య సామీప్యమును బొంది యున్నాము; నవనవోత్ఫుల్ల కుసుమవాసన లుద్యానవన మంతయు వెల్లివిరిసిన విధమున నవిచ్ఛిన్నంబైన యీ ధరాతలంబున పరాత్పరజ్ఞానము విస్తరిల్లును. ఇందనుకఁ బ్రవక్తలంద ఱేమహాపురుషుని యవతారవిషయమై యేకగ్రీవముగా ముచ్చటించుచుండిరో యట్టి సత్యమూర్తి యవతరించుచున్నాఁడు; ఆ మహాత్ముఁడు స్వార్థము నిరసించి లోకసామాన్యమైన సుఖదుఃఖముల కతీతుఁడై పరఁగువాఁడు. బహుభారపీడితమైన కుశప్రకాండమునైన త్రుంపి క్లేశము నొందింప వెఱచువాఁడు. కమనీయభూమిభాగమున ధూళిధూసరిత గాత్రముల నిద్రాప్రమత్తులైనవా రనేకులు తెలివి నొందు సమయము, మదాంధీభూతులైన క్రూరకర్కశహృదయులు పరితాపతప్తులై దుఃఖించు సమయ మరు

దెంచెను. మీరు మీఱొనరించిన పాపసంచయమునుండి విముక్తులు కానిచ్చగింతురేని పశ్చాత్తాపతప్తహృదయములతో నా సర్వజ్ఞుని, నామాయాతీతుని, నా వేదాంతవిజ్ఞానదుర్లభుండైన యీశ్వరుని పాదసరోజములవ్రాలి శరణము వేఁడుఁడు. దుష్టశిక్షకుండును, శిష్టరక్షకుండు నైన యా జేసు రక్షకుండు మిమ్ముద్ధరించు'' ననుచుఁ బ్రజానీకమున కాపురుషోత్తముని యవతారవిషయ ముద్బోధించుచు శౌచస్నానోదకంబుల నొసంగుచుఁ బర్యటనంబు సలుపుచుండెను.

నాజరెత్తులో మాయాబాలకుండైన క్రీస్టస్ శుక్లపక్ష క్షపాకరునిబోలె దినదినప్రవర్ధమానుడగుచుండెను. నానాఁటికి వయస్సు నిండార, వయస్సుతో హృదయవిజ్ఞానము ముఖకాంతులు వెల్లివిరియఁ. గర్ణాలంబిత కాకపక్షములతోఁ, బూర్ణోత్సాహముతోఁ జూపరుల హృదయంబులు చూఱఁగొనుచు, బాల్యక్రీడలు సల్పుచు, నాతఁడు క్రమక్రమంబున ద్వాదశశరద్వయస్కుఁడాయెను. ఆచారప్రకారము జోసెఫ్ మరియమ్మలు పాసోవరుత్సవమును సందర్శించు కుతూహలమున జెరుసలేమునకుఁ బయనింప క్రీస్టస్సు కూడ జననీజనకులతోఁ గలసివెడలెను. అచ్చట నాబాలకుండాలయ ప్రవేశమొనరించి, చవులుగాఁ జెవులకు సామగానంబులు సదువు నుద్గాతల చదువు వినును ; మంత్రతంత్రార్థసంబంధభావములు పేర్కొను మతాచార్యులఁ గూడికొనును ; కొందఱతోఁ జర్చించును ; కొందఱతోఁ దర్కించును ; కొందఱతో నవ్వును. అట్టి విశేషవిజ్ఞాన

సంపన్నుండైన క్రీస్తస్సుంగని మతగురువులు హృదయములఁ దల్లడిల్లిరి ; సభ్యులు నిజపాపౌఘనివృత్తిసమయ మాసన్నంబాయెనని సంతసించిరి. ఇట్లాతం డచట నొక్కింత తడవందఱ కన్నివిధంబులై వినోదించి తల్లిదండ్రులతోఁ గలిసి బుడిబుడి నొడువులు నొడువుచు గృహమ్ము సేరుకొనెను.

*　　　*　　　*

సుమారిరువది సంవత్సరములు గడచెను, ఈ కాలము జేసునాథునకు సాధనసమయమై యుండనోపును. ఏ మహాపురుషుని జీవితము పరిశీలించినను నందొక కొంత కాలము సాధనసమయముగా నుండుట ప్రత్యవగతంబగును. ఆ మహాత్ముని పుట్టుకవోలె నా సాధనయు లోకసంగ్రహార్థమే. సృష్టిస్థితిలయకారకుఁడైన లీలామానుషవిగ్రహున కీ సమస్త కర్మలు విడంబనంబ. క్రీస్తస్సు ప్రబోధసమయమునఁ జూపిన యతిమానుషంబులగు నద్భుతకృత్యము లర్థము చేసికొనిన నాతఁడు యోగసిద్ధిఁబొందిన మహాపురుషుఁడని తెలియఁగలము.

*　　　*　　　*

త్రిజగద్గురుండనఁదగిన శ్రీకృష్ణుండు లోకవిడంబనార్థము గురుభజనంబు పరమధర్మంబని సాందీపనియొద్ద విద్యాభ్యాసం బొనరించినట్లు క్రీస్తస్సు జొహానును జేరి తనకు శౌచస్నానమిమ్మని కోరెను. ఈ వింతచర్య కాతఁ డెంతయుఁ జకితుఁడై ప్రభువును క్షమింపుమని వేఁడుకొనియెను. అంత లోకరక్షకుండైన క్రీస్తసు లోకసంగ్రహార్థ మయ్యది కడుం

గడు ముఖ్యమని జొహానునకు నచ్చఁజెప్పి వానిచే శౌచ స్నాతుఁడాయెను. ఆ పుణ్యసమయంబున నొక రాజ హంసంబు గగనమండలమునుండి దిగివచ్చి, యతని యంస భాగంబున వ్రాలి, మృదుమధురములైన దివ్యవాక్కులతో, "నీవు నా ప్రియకుమారుఁడవు, నీయందు నా కనురాగము మెం" డని పలికి యంతర్ధానము జెందెను.

ప్రభువు ప్రజానీకమునకుఁ బ్రబోధించు సమయ మాసన్నమాయెను. ఇట్టి మహోత్కృష్టకార్యమునకు నాందియో యనునట్లు జేసునాథుఁడు క్వారెంటేనియా పర్వతప్రదేశమును జేరి నలువదిదినమ్ములహోరాత్రము లుప వాసదీక్ష వహించి ధ్యానయోగమున నిష్ఠాపరుఁడై సకల లోకంబులకుఁ బరమేశ్వరుఁడయ్యె దాను ఘోరతపం బొన రించెను. ఆ తపోగ్నిజ్వాల లతిభీకరంబులై మిన్నుముట్ట నీశ్వరాకిమైన సైతాను. క్రోధభయేర్ష్యాపూరిత హృదయ ముతోఁ దత్తపోభంగ మొనరింప లోకభీతిదాయకములైన విద్యుద్యుతిచ్ఛటలును, జటులనిర్ఘాతమును విసర్జించి సామాన్యమానవాకృతి ధరియించి, యెన్నులవ్రేగున వ్రాలిన సస్యముల సందులఁదిరుగాడు శారదానిలమువోలె మర్మర ధ్వనులఁబల్కరించుచు జేసునాథుని నల్లనల్లన జేరెను. ఆహార నిద్రాపానీయము లెఱుంగని యాకృశీభూత జీర్ణాంగమును గాంచి యదియ మంచి సమయంబని మదినెంచి, "ఓ నవ మన్మథ మన్మథా! నీ సుందర సుకుమారగాత్రమేల యీలీల దయమాలి నిరశనుండవయి ఘోరతపంబున నలయించి

వైచుచున్నాఁడవు? నీ వా యనంతుని కుమారుఁడవే! ఆ రాలను రొట్టెలుగాఁ జేసి యారొట్టెలతో నీక్షుత్తడఁచుకొన రాదా'' యనియు, ''పర్వతపాదభాగమున భక్తులైన దేవ దూతలు నీ దర్శనార్థంబు నిరీక్షించుకొనియున్నారు. క్రింది కవతరింపు'' మనియునాతనిని బరీక్షించి, తన మోసమువమ్మ యిన నర్థకామాశఁజూచి యీ బీద వడ్రంగి పసయుడంచి వైచెదనని, ద్విగుణీకృతమాత్సర్యముతో, ''ఓక్రిస్టస్ !ఆదిగువ జూడుము. ఆచతుస్సాగర వేలావలయ వలయిత వసుమతీ ప్రదేశము నా సామ్రాజ్యము; సకల రాజన్యులును నా కనుసన్న మెలఁగుదురు; నన్నుఁ బూజించిన నా సామ్రాజ్య మునకు నిన్నభిషిక్తునిఁ గావించెద'' నని ప్రల్లదంబు లాడెను. సైతాను చర్యలింక సహింపరానివగుటయు భగవానుఁడాతని గట్టిగా గద్దించి గర్వభంగం బొనరించి నిర్జించి విజయంబు గాంచి మించె. తోడనే దివినుండి దేవదుందుభులు మొఱసె; సురలు విరులజొంపములు కురిసిరి. అంత సాయంసమయ చ్ఛాయామూర్తు లంతంతకు దీర్ఘంబులై తోఁచె; రుచిమాలి యంశుమాలి పశ్చిమాంబుధిఁ గ్రుంకె.

* * *

విశాలసముద్రోపరితలంబున నుత్తుంగతరంగములు పై కెగయుచుఁ బడుచుండెను. ఈ యుద్వృత్తి పతనము లొక దాని వెనుక నొకటి తప్పనిసరిగవచ్చును. ఈ విశ్వమానవ జీవితేతిహాససిద్ధాంతములోఁగూడ నీ సత్యమే యవగతం బగును. మహాత్ముఁడైన జేసునాథుఁడు, యూదులందఱును

లోకాయతిక చిత్తములతో భగవంతుని మఱచి, పరసత్యం బునకు దూరులై పతితులైయున్న సమయమునఁ బతితపావనుఁడై యవతరించెను. తన యవతారకార్యమును సాధించుట కాతఁడు పర్యటించినది వర్షత్రయకాలము మాత్రమే; ప్రబోధించినది స్వల్పమే. కాని యా పురుషోత్తమప్రబోధిత సత్యరహస్యము నెఱుంగుట కిరువది శతాబ్దంబులు కావు కదా యింకను నెన్నివేల యేండ్లు కావలెనో మనకు!

అహంకృతి, దైవతిరస్కృతి, మౌఢ్యము ప్రబలి యుండిన యా యూదహృదయంబు లాతని ధర్మప్రబోధ మర్మ మెఱుంగవలెననినఁ, దన విశ్వ ప్రభుతయందు వారికి విశ్వాసము గలుగవలెనన్న నాతఁడు కొన్ని యతిమానుషములైన యద్భుతకార్యము లాచరింపవలసియుండెను. కేనానగరమున వివాహమహోత్సవమున విందునకేగి స్వాదుజలముల వాచవియగు వాసితరాజన్మధురంద్రాక్షాసవముగా మార్చెను. అచ్చోటనే యాసన్న మరణుఁడై పడియుండిన యొక రాజోద్యోగి తనయుని చిరంజీవియని దీవించి, ప్రాణదానమొసఁగి రక్షించెను. దేవళములో ధర్మప్రబోధము సేయుచుఁ, బిశాచావేశమున బాధపడుచున్నవానిని బీడానివారితునిఁ గావించెను. జ్వరముచేఁ బెద్దయుంబ్రొద్దు తపించి పోయెడు పీటరు ముదుసలి యత్తగారిని స్వస్థురాలిం జేసెను. తనయందు భక్తివిశ్వాసములుంచి పూజించి ప్రార్థించిన కుష్ఠపక్షవాతరోగుల పాపములు క్షమించి సకల సుందరాంగులుగా దీవించి పంపెను. పుట్టంధులకుఁ జూపొసఁగి ప్రోచెను.

మేరీ మార్తాల సోదరుఁడైన లాజరస్సును మరణించినవానిని బునర్జీవితునిఁ జేసెను. ఐదు రొట్టెలతో, రెండు చేపలతో నైదువేలమంది భక్తులకుఁ దృప్తితీర సంతర్పణంబుచేసి మిగిలిన భోజన పదార్థంబులను బండ్రెండు బుట్టల కెత్తించెను. ఈ యతిమానుషకర్మములతోఁ బ్రజలు ముగ్ధులై రక్షకుండైన జేసునాథునికి మస్తన్యస్తముకుళిత హస్తులై జేజేలొనరించిరి.

క్రమక్రమముగాఁ బండ్రెండుగురు మహాభక్తులు జేసునాథుని నాశ్రయించిరి. మనోవాక్కాయముల వా రాతనిఁ బాపసంకలిత యూదోద్ధరణార్థము భువి నవతరించిన పరమపితగాఁ బూజించి సేవించిన ధన్యజీవులు. వారందఱియందును జొహాను ప్రభువున కత్యంతము కూర్చువాఁడు; పీట రహంకారి; జూడాస్ మూర్ఖద్రోహి. రక్షకుఁడైన జేసునాథుఁడు భక్తపరివృతుఁడై ధర్మప్రబోధముసేయ పర్యటనము ప్రారంభించెను. భగవదాగమనమునకుఁ గాలము పరిపక్వమాయెననియుఁ, బ్రతిమానవుఁడును బశ్చాత్తాపతప్త హృదయముతో నాత్మపారిశుద్ధ్యమును గాంచి యీశ్వర పాదసరోజముల నాశ్రయించి సకలశుభమ్ముల నందఁగలఁడనియు సౌత్సుక్యముతో నుద్బోధించెను. అస లీ మహాత్ముఁడే సకల వేదసారసంగ్రహము. అట్టి యీతఁడు ప్రబోధించిన 'గిరిశిఖోపనిషత్తు' సకల ధర్మోపదేశ సారసంగ్రహము. ఒకనాఁడు జేసునాథుఁడు దేశదేశములనుండి వచ్చిన నానాబధిరోన్మత్తపంగ్వంధాది రోగులఁ దన యమృతహస్తమున నాశీర్వదించి స్వస్థదేహులఁ గావించి, యొత్తికొనివచ్చు

ప్రజానీకమును దప్పించుకొనుటకై తానొక పర్వతశిఖర మునకుం జేరి, ప్రార్థనపూజారూపమున విశ్రాంతిగైకొని, తన్నువిడవలేక వెన్నంటివచ్చిన శిష్యసముదాయమును గనుంగొని భవబంధమోచనుండు ప్రసాదవచస్సుల మోక్ష మార్గము నిట్లుపదేశించెను ; "భక్తివినమ్రులైనవారలే యదృష్టవంతులు, వారే మోక్షగాములు. పశ్చాత్తాప తప్తులకే హృదయశాంతి లభించును. అడఁకువగల్గి యీశ్వర పూజాభాజనంబై తనరుచువారల జీవితములు ధన్యములు. దయామయులపైనే యీశ్వరుని కరుణ ప్రసరించును. నిర్మల హృదయులై, శమదమసంపన్నులై నన్ననుకరించి యిడుమలఁగుడుచు మీ రెంతయుఁ బుణ్యజీవులు. మీకు శాంతి భద్రతలు గలుగును. మీ రీప్రపంచమును వెలిఁగించు జ్ఞానజ్యోతులు. ప్రాణివధ మాట యేల, ప్రాణిహింస చాలు, మిమ్ముల నరకాగ్ని దహించివైచును. మీ శత్రువునైనఁ బల్లెత్తుమాటయైన నాడఁగూడదు; మనస్సు నొప్పింపఁ గూడదు. మీ పూర్వధర్మశాస్త్రములు వ్యభిచారము పరమ పాపమని వచించెను. కాని కాముకుఁడై, పరకాంతాముఖావ లోకనము చేసినను వ్యభిచార పాపపంకిలుఁడే మానవుఁడు. ఆ దుష్టభావమునకుఁ గారకురాలైన యక్షిమును 'అంగ వ్రాతములోఁ జికిత్సకుఁడు దుష్టాంగంబు ఖండించి శేషాంగ శ్రేణికి రక్షసేయుక్రియ' తత్క్షణమే యూడఁబెఱికి పాఱ వేయవలెను. కట్టుకొనిన ధర్మపత్నిని విడిచిపెట్టినవాఁడు వ్యభిచారిసమానుఁడు. తలపైఁ జేయివైచి 'దైవము

సాక్షిగా, భూదేవిసాక్షిగా' అని యొట్టుపెట్టుకొనుట యతి పాపము. 'దెబ్బకుదెబ్బ తీయవలెను, కుక్క కాటుకుఁ జెప్పు దెబ్బ' యని మూర్ఖులాడుదురు. అది కడుంగడు నీచము. హింసను సైతము మహింసచేతనే జయింపవలెను. మిమ్మెవరైన నొక చెంపపైఁగొట్టిన రెండవచెంప ద్రిప్పుఁడు. మీ యంగీ నెవఁడైనఁ దీసికొనినఁ బై బట్టసహిత మిచ్చివేయుఁడు. మీ శత్రువును సహితము మీరు ప్రేమించవలెను. అదియే కుమ్మలను జగిన్నాథునివలెఁ బరిపూర్ణస్వభావులుగఁ జేయును. నిరాడంబరజీవనమే జీవనము, గుప్తదానమే దానము, నిష్కామపూజయే పూజ. ఇంద్రియలోలత్వము విసర్జించి, దైహికసుఖముల నవలఁద్రోసి. ఐశ్వర్యము నంట రాని మహావిషంబుగాఁ బరిగణింపవలయును. సర్వము నా భగవంతుఁడే సరిచూచుకొనును. నాఁటుపోసినవాఁడు నీరు పోయకుండునా? వనపుష్పములు విరియఁబూయుచున్నవే! తమ ప్రఫుల్లత కవి కష్టించినవా! తప్పులెన్నువారు తమ తప్పు లెఱుఁగరు. పరదూషణ పరమదోషము. కేవలము జపమాల ద్రిప్పువారలకు మోక్షము గలుగఁబోదు. ఈశ్వరా దేశము నెఱింగి యాచరించిన భక్తులకు సర్వశ్రేయము లొడఁగూడును; కైవల్యము హస్తామలకమగును." ఇట్లుప దేశ మొనరించిన యనంతరము భగవానుఁడు దివ్యరూప ముపసంహరించి, తన పనుల గుఱ్తెఱింగి సంచరించు పసుల కాపరిచందమునఁ గొండదిగివచ్చి భక్తులం జేరెను. వారి కంటికి మనస్తృప్తిగా నందఱ నన్నివిధంబుల ననునయా

లాపంబులు సలిపి తనివి నొందించెను. జేసునాథుని యుప దేశంబంతయు భక్తజనులకు సుగ్రహంబుగానుండుట్కై యితిహాసమయంబు గావింపఁబడియుండెను. అతఁ డహర్ని శము 'నేను' అనునది యాత్మయనియు, నాత్మ యవినాశ కంబు నవిముక్తంబునైన శుద్ధసత్వంబనియు, అహంబ్రహ్మాస్మి యనియు, తత్వమసియనియుఁ బ్రబోధించెను. "నేనా పర మాత్ముని తనయుఁడను", "నేను, నా పరమపితయు నొకటే", "మీరందఱును భగవంతుని సంతానమే", "ఆ భగవానుని దివ్యధామము మీ హృదయములందే యున్న"దని గంభీరవచస్సుల నానాజరీనుఁడైన జేసను నిత్యము పలుకుటయే కాని యా మహానుభావున కీప్రపంచ ముతో నే యితర సంబంధమును లేదు. తమఃప్రపంచమును దివ్యజ్యోతితో నింపుట, మర్త్యకోటి కమృతత్వము బ్రసా దించుట—ఇదియే యా మహాత్ముని నిర్దిష్టకార్యము. 'ఓ పరలోకమందుండు మా పితా' యను ప్రార్థన సామాన్య జనానీకమున కందుబాటులో నుండునంత సులభసంవేద్యమై యొప్పుచున్నది. భక్తులకు భక్తియోగము, సాంఖ్యులకు సాంఖ్యము, జ్ఞానులకు జ్ఞానయోగము బ్రబోధించిన యోగే శ్వరేశ్వరుఁడు, సన్యాసమే సంసృతివిముక్తికి, మోక్షసిద్ధికిఁ బరమమార్గంబుగా నెఱింగించిన జ్ఞానమూర్తి జీవితాంతము వఱకును లోక సంగ్రహార్థమై సామాన్య మానవునివలెనే కాలముగడిపెను. నానాఁటికి మత గురువులకు, పరసయ్యూ లకు హీరోదుప్రభువునకుఁగూఢ జేసునాథునిపై నసూయా

వైషమ్యములు పెచ్చుపెరిగిపోయెను. వారు జేసు నాస్తికుఁడనియు, సాధుపురుషులకుఁ బరమశత్రువనియు, దుర్మార్గులకు మిత్రుఁడనియు, నాతఁడొనరించు నతిమానుష కర్మంబులన్నియుఁ బైశాచికంబులనియు దుష్ప్రచారము జెలరేగించిరి. రాజవకాశము దొరికిన నతని శిక్షింపవలెనని సమయమునకై వేచియుండెను.

పస్కాపండుగ సమీపించెను. విందు సిద్ధమాయెను. జేసుప్రభువు పరిశుభ్రజలంబులతో శిష్యపాదములు ప్రక్షాళించి వారితోఁ గలిసి భోజనమునకుఁ గూర్చుండెను. అంతనాతఁడు "మీలో నొకఁడు నన్ను నాశత్రువుల కప్పగించు" నని వచించుటయు, నందు కందఱును గడుంగడు దుఃఖించి యెవరికివారే 'నేనా'! నేనా!' యని ప్రశ్నించుకొనఁజొచ్చిరి. పీటరహంకారముతో "నెవరేపనిచేసినను జేయఁగలరు కాని నేనుమాత్ర మట్టి నీచకార్యమెప్పుడును జేయ"నని ప్రగల్భములాడ, జేసు, "ఈరాత్రియే కోడికూయక మునుపు నీవు నన్నెఱుఁగనని ముమ్మారు రాజభటుల దౌర్జన్యమునకు వెఱచి నన్ను నిరాకరించెదవు సుమా" యని పీటరునకుగర్వభంగమగునటులు హెచ్చరించెను. అంతట జేసునాథుఁడొక రొట్టెఁ దీసి, దాని నాశీర్వదించి, "యిది నా శరీరము దీనినిమీరు గొనుఁ"డని చెప్పి పంచియిచ్చెను. అనంతర మొకపాత్రవారి కందిచ్చి "ఇందలిరసమ్మస్మదీయహృదయరక్తము ; పతితమానవుల క్షాళితాఖిలకల్మషులుగాఁ జేయ జిందింపఁబడిన నిబంధనరక్తము; దీని నాస్వాదింపుఁ" డని

చెప్పెను. తరువాత శిష్యపరివృతుఁడై గెత్సెమనీవనముఁ బ్రవేశించి, యందు ధ్యానసమాధి నొకింత తడవుండి, మగిడి పయనించు సమయమున బ్రముక్కడిరక్కసుల మూక రొక్కటి యెక్కడనుండియో వచ్చి యాతనిఁ జుట్టుముట్టెను. అంత నాతని శిష్యులలో నొకఁడైన జూడాస్ ప్రభువును సమీపించి, 'తండ్రీ, నీకు శుభమగు' ననుచు నతని దివ్యపాదారవిందముల వ్రాలి పాదచుంబనము గావించెను. అది సంజ్ఞగా నెఱింగినయాశాస్త్రవసమూహం బాతని బంధితునిఁ గావించి, పాంటియస్ న్యాయాధికారియొద్దకుఁ గొంపోయిరి. ఆమూర్ఖులదంభత్వము, మదాంధత, మౌఢ్యము నర్థముచేసికొనలేని యా న్యాయమూర్తి పాపభీతి యను దవానలంబు నిజహృదయగహనంబు దహింపుచుండ, మత గురువుల యొత్తిడిచే నితికర్తవ్యతామూఢుఁడయి యా కఠిన కర్కశహృదయుల, కారక్తపిపాసువుల కా జేసునాథుని సిలువవేసికొనుఁడని యాహుతిగా నర్పించెను.

దేహమున రక్తవస్త్రములు, తలమీఁద కంటక కిరీటము, చేత నొక బొంతకఱ్ఱధరించి నిబిడాంధకారమున నొక దివ్యపురుషుఁ డొక దుర్భరమైన సిలువ నతిప్రయాసమున భుజమున కెత్తుకొని ప్రళయకాల సముద్ఘాతనిర్ఘాతభీషణ ధ్వానమువలె విశ్వమందంతటను నితాంతప్రతిధ్వనులీను దుస్తరకఠోర దుఃఖార్తితోఁబరేతభూమిఁజేరెను. రాత్రియో, మధ్యాహ్నమో తెలియని యా కాళనిశాసదృశ మధ్యాహ్నమున, నిరుగెడల నిద్దఱు దొంగలు కఠినశిక్షాబాధితులై

యుండ, మధ్య సకలరోగార్తుల నుద్ధరించిన యా దివ్యకర ములకినుప మేకులు గొట్టఁబడి, ఇల్లనక వాకిలియనక శ్రమ మనక విశ్వమంతయు నిరంతరపర్యటనము సలిపిన యా దివ్యచరణములు రక్తమండితములై సిలువపై ననంత ప్రశాంతి ననుభవించుచుండఁ, బ్రధానయాజకులు, మతగురు వులు, పెద్దలు, స్త్రీలునా సిలువచుట్టును జేరి జేసునాథుని హేళనచేయ మొదలిడిరి. ఈ దేవళమును నాశనమొనర్చి దినత్రయములోఁ బునస్సృష్టి గావింతునని ప్రగల్భములు కొట్టితి, నేఁడు నిన్నిప్పుడు రక్షించుకొనుమనియు, నీ వీశ్వర కుమారుడవైన, నేఁడీ యా సిలువనుండి దిగి రా చూచెద మనియు, ఇతరులను రక్షింపఁగలిగెను, తన్నేల రక్షించు కొనలేకపోయెననియు, ఇస్రయేలుల రాజైన యా జేసు నాథుఁడు క్రిందికి దిగివచ్చిన నాతని రక్షకుఁడని నమ్మెద మనియు, ఆతఁడు భాగవతోత్తముఁడు కదా! ఇప్పుడాతని నీశ్వరుఁడే రక్షించుననియుఁ బలువురు పలువిధముల నాడి పోసిరి. పతితపావనుఁడైన జేసురక్షకుఁ డా కల్మషజీవులఁ గనికరించి 'యప్రాజ్ఞు' లని క్షమించి యుపసంహార సమయ మాసన్నమగుటచే నిజావతారంబుఁ జాలించెను.

ఆ మహాశ్మశానమున దుస్తరదురంత కఠోర క్లేశము— గాఢాంధకారము — తన్మధ్యంబున మిన్నంది తేజఃపుంజమై వెలుఁగొందు సిలువ—కష్టసముద్రమున మునిగిఁపోవువారి నుద్ధరించు తరణి—కలకాలము తమఃపటలిని ఛేదించి ప్రకా శించు నీశ్వరవిజయపతాక—మెఱసిపోయెను.

# 3. బుద్ధభగవానుఁడు

రాజదంపతులు హంసతూలికాతల్పమునఁ బవ్వళించి యుండిరి. మహారాజ్ఞి మాయాదేవి స్వప్నావస్థలోనుండెను. నభమందుండి యొక దివ్యనక్షత్రము. కామధేను క్షీర సన్నిభధౌతదంతషట్కముతో నలరారు గజరాజము రమ్య కాంతుల వెదజల్లుచువచ్చి యామె గర్భమునుజొచ్చి సవ్య భాగమునఁజేరెను. మాయాదేవి మేల్కాంచెను. ఎఱుఁగ రాని యొక దివ్యానందమామె హృదయమునఁ బొంగి పొరలెను. ఇంతలోఁ దూరుపు తెల్లవాఱెను. దేదీప్యమాన మైన తేజస్సాకాశమున నంతట వ్యాపించెను. బుద్ధభగ వానుఁడు ప్రభవించుచున్నాఁడను మర్మరధ్వనులతో విశ్వ హృదయము నిండి యుప్పొంగెను. రాజజ్యోతిష్కులు, మహాపండితులు "రవి కర్కాటకమునం దున్నాఁడు. మహారాజ్ఞి గర్భవాసమున విజ్ఞానఖనియైనవాఁడు, సకల ప్రపంచమును విద్యాతిమిరంబునుండి సముద్ధరింపఁ గలిగిన ప్రబుద్ధుఁడు, పరమపవిత్రశిశు వుద్భవించు"నని స్వప్న ఫలముఁ జెప్పిరి.

మాయాదేవికి నెలలు నిండెను. ఒకనాఁటి మధ్యాహ్నసమయమున నామె నిజాంతఃపురోద్యానవన మున న్యగ్రోధవృక్ష రాజచ్ఛాయ నధివసించియుండెను. అంత శుభోదయవేళయగుటయు నిజశాఖాసమూహంబుతో మిన్నుముట్టెడు నాతరువు నేలకువంగి సుగంధపుష్పాలంకృత

కిరీటం బామెవాళి నలంకరించెనో యనునట్లు పొదరింటిఁ నొకదాని నామెకు సంతరించెను. భూదేవి సద్యోవినిర్గత పరిమళకుసుమరాజిచే నొకశయ్య నేర్పఱిచెను. ఆ దివ్య బాలకు పుట్టిస్నానమునకై యచటనున్న యొక చంద్ర కాంతశిల మంజుల జలప్రవాహమును బ్రసాదించెను. అంతఁ గొంతసేపటికి రాణి సుఖప్రసూతయయ్యెననియు, సకల శుభలక్షణశోభితుండగు ముద్దుకొమరుండు జనించెననియుఁ మంగళప్రదమైన వార్త రాజునకుఁ గొంపోఁబడెను. రాజు మందానంద కందళితహృదయారవిందుఁడై రాజకుమారు నంతఃపురంబునకుఁ గొనిరా రత్నసువర్ణాలంకృతమై రమణీయమైన పల్యంకిక నొకదానిని బంచెను. నలుగురు దిక్పతులును సామాన్యాకృతుల నిజరూపంబుల మఱుగుపఱిచి, భూభారము తొలఁగింప నవతరించిన యా 'పిన్నపెద్ద' భారము వహించిరి. రాజకుమారుఁడు రాజగృహముఁ బ్రవేశించెను. ఏతత్సమయంబున వింత శకునంబులు దోఁచుటయు రాజహృదయ మాందోళితమయ్యెను. వెంటనే శుద్ధోదనుఁడు పండితుల రావించి నిజదేవీ స్వప్నఫల మింకొక మాఱడిగి వారివలనఁ దన కుమారుండు తప్పక మహాచక్రవర్తి యగునని యెఱింగి సంతుష్టహృదయుఁడై రాజ్యమందంతటను గొప్ప యుత్సవము చాటఁబంపెను. సకల సామంతభూపాలాలంకృత సభాభవనమున నొక శుభ ముహూర్తమున నా రాచబాలునకు సర్వార్థసిద్ధుఁ డను నన్వర్థనామకరణంబు గావించిరి.

ఆసభామంటపమున విజ్ఞాన సంపత్తిచేఁ బలితకేశుఁడై యొప్పు నసితమహర్షి తన దివ్యతేజస్సు వెల్లివిరియఁజేయుచుండెను. రాజదంపతులిద్ద ఱామహాత్ముని పాదపద్మములకు సంప్రణామంబు లాచరించి తమ కుమారరత్నము నాతని ముందుంచిరి. అతండాశిశువు నవలోకించుటయే తడవుగా నిజాసనంబునుండి దిగ్గన లేచి యశ్వాలు పాదధూళి కనుల కద్దుకొని, "దేవా! లోకోద్ధారకా! జగద్రక్షకా! పాప పంకమగ్నమైన సర్వజగము సముద్ధరింప భువి కవతరించిన శ్రీబుద్ధదేవా! ధన్యుఁడను, ధన్యుఁడను. అనితరలభ్యంబైన నీదర్శన మహాభాగ్యంబబ్బెను. నాజన్మ తరించె"నని పల్కి, రాజాభిముఖుండై, "రాజా, యీపాపఁడు మానవ వృక్షంబు పెక్కువేల యేండ్లకొకమారు పుష్పించు నవ నవోత్ఫుల్లకుసుమరాజంబు. వికసించి విజ్ఞానవాసనా ఘుమ ఘుమలు విశ్వమందంతట వెల్లివిరియఁజేయును; ప్రేమామృతమును ప్రాణికోటిపై వర్షించును. ఈ రాజగృహమున దివ్యరాజీవంబు సముద్భవించినది. ఎంత యానందదాయకమో కదా! కాని—కాని. యోరాజా! ఈ రాచపాపని విషయమున మీహృదయకుహరమునకొక కఠోరాఘాతము తగులనున్నది! అమ్మా. మహారాజ్ఞీ, ఈ దివ్యశిశువును గనిన భవదీయ గర్భంబెంత శ్లాఘనీయంబైనదమ్మా! ఇఁక నీ కష్టములు గట్టెక్కును. మానవ జీవితమే దుఃఖ భాజనమైనది. కాని నీవింక నేఁడు రోజులలో దుఃఖాతీతమును, శోకరహితము నైన యవస్థ నందగల"వని భావిఫలంబు

సూక్ష్మవ్యంగ్యరీతులఁ దెలియఁజేసెను. నాఁటి కేఁడవనాఁటి రాత్రి మాయాదేవి మందస్మిత వదనారవిందముతో నిజ హంసతూలికా తల్పమున శయనించెను. ఆ నిద్రయే యాపె చరమనిద్ర.

రాజకుమారున కెనిమిదేఁడుల ప్రాయము వచ్చెను. శుద్ధోదనుఁడు మంత్రి సామంతులతోఁ బేరోలగంబుండి తన కుమారునకు విద్యాభ్యాసనం బొనరించుటకు విజ్ఞాన ఖనియైన సద్గురు వెవ్వరాయని యాలోచించుటయు, నందఱును విశ్వామిత్రుండని యేకగ్రీవముగా నుద్ఘోషించిరి. విశ్వామిత్రుని కాహ్వానము వెళ్లెను. ఆ ఋషిపుంగవుం డరుదెంచి యొక శుభముహూర్తమున రాచపాపనిఁ జేరఁదీసి, దేదీప్యమానంబైన యొక రత్నస్థగిత శ్రీచందన ఫలకంబున గాయత్రీ మంత్రరాజంబును లిఖింప నాజ్ఞాపించెను. గురు వాజ్ఞాపించుటయె తడవుగా, నాబాలకుఁడన్ని భాషలలో నద్దాని లిఖించి చూపెను. ఇంతియే కాక గణితశాస్త్రమున నధిక మేధాసంపన్నతఁ జూపెను. ఈ విజ్ఞానం బపూర్వమని యందఱు నాశ్చర్యచకితులైరి. ఆచార్యుండైన విశ్వామిత్రుండును సమందానంద తరంగితాంతరంగుండై, "నీవెక్కడి శిష్యుఁడ, నే నెక్కడి గురుఁడను? నీవు సకలలోకాచార్యుల కాచార్యుడవు. జగద్గురువ వయ్యును సామాన్య శిష్య స్వరూపంబున లోకసంగ్రహార్థమై చదువఁదొడఁగితివి. సామాన్య మానవులకు విద్య భూషణంబగుఁగాని ప్రాఁబల్కుల పాలవగు నీవీ చదువులకే యలంకరణంబ" నని నతులొనర్చి

యా మాయా బాలకుని పాదధూళి భక్తి వినమ్రుఁడై మౌళి ధరించి నిజగృహంబున కేగెను.

రాజకుమారుండు రాకాసుధాకరబింబమువోలె దిన దిన ప్రవర్ధమానుఁడై వయస్సుతో పాటు విజ్ఞానమును, విజ్ఞానముతోపాటు వినయమును నభివృద్ధిపొంద, రాచఠీవితో, ధైర్యసాహసములతో రాజకుమారోచితములైన యశ్వారోహణము, విలువిద్య మున్నగువాని నసదృశకౌశలంబున నభ్యసించెను. ఆతం డొకనాఁడు సమానవయస్కులగు సహచరులతోఁ దన యుద్యానవనమునకుఁ బోయెను. అం దాతఁడటునిటు వినోదార్థంబు పర్యటనంబు సేయుచుండ విహాయసమార్గమునఁ గపోతసమూహ మొకటి ప్రణయగీతములు పాడుకొనుచు నింటిముఖంబుగాఁ జనుచుండెను. ఆ మనోహరదృశ్యమును సర్వార్థసిద్ధుఁ డానందంబున మధుర పీయూషమువోలె నేత్రములఁ ద్రావుచుండ నందుండి యొక కపోతంబు నేలఁగూలె. ఆ పక్షి పక్ష మధ్యంబునఁగల శిత బాణంబును, దద్బాణాఘాతోజ్జిత రక్తసిక్త తూలికలను జూచి యా దయాసముద్రుని హృదయము నీరైపోయెను. వెంటనే సిద్ధార్థుఁ డా పడిన పావురంబును దీసి, యొడిలోఁ బెట్టుకొని తన మెత్తని చేతులతో నిమురుచు, నా యమ్ముపెరికి, యచ్చోట నాకులపసరుమం దుంచెను. ఆ దెబ్బయొక్క తీవ్రతరబాధ నూహింపఁజాలక యాయాశుగముతోఁ దన చేతఁ గుచ్చుకొని తద్బాధాజనిత బాష్పకణపూరితనయనంబులతో దాని ననునయింపఁజొచ్చెను. అంతలో నొకదూత యచటి

ధించి, రాజకుమారునితో "ఆర్యా! మా ప్రభువగు దేవదత్తు నిచేఁ బంపఁబడితిని. అస్మదీయప్రభు హస్తన్యస్తధనుర్విముక్త బాణంబుచే నేయఁబడి కపోతరాజం బొండిపుష్ప వనమ్మున నీ మాలతీనికుంజమునఁ బడియెను. దయచేసి యా పక్షి నిప్పింపవలయు"నని యడిగెను. అందుపై సిద్ధార్థుం డా దూతం దిలకించి, "ఓయీ! పక్షి మరణించియుండిన పక్షం బునఁ జంపినవానికిఁ బంపించుట సమంజసము గాని యియ్యది ప్రాణసహితంబు. నా సోదరుఁ డీ స్నిగ్ధసుందరమృదుల పక్షంబులోని దివ్యగతిసమాత్రమే యంత మొందించె"నని ప్రత్యుత్తరంబిచ్చుటయు, వెనుక నేయున్న దేవదత్తుఁడా మాటలకు "రాజకుమారా, వన్యశకుంతం బెవ్వని బాణమున నేలకు వ్రాలునో వాని దేసుమా! ప్రాణమున్నది, మరణించిన దను సంశయము నాలోచింప నవసరము లేదు. అది గగన మార్గమున సంచరించునప్పు డేరిదియును గాదు కాని మదీయ బాణనిర్భిన్న పక్షములతో నేలఁదాకిన యిది నాయదియే" యని చెప్పెను. వెంటనే హృదయము నిర్వేదమును బొందఁ, జప్పున నాపిట్టను జేతులతో నిమురుచు, రాకుమా రుఁడు దాని మెత్తనిమెడను తనచెంపకుఁ జేర్చి లాలించి దాని నెడఁబాయఁజాలక. "నేనీయను. ఇయ్యది నాయదే, ఈశ్వ రుఁడు దయాసముద్రుఁడు. ఆతని ప్రేమ యనంతము. ఆ దివ్యప్రేమకారణముగా నీ విహంగము నాయది. ఈ విహంగమే కా దీ ప్రపంచమంతయు నాయది. హింసా మయమైన, దుఃఖభాజనమైన యీ మానవప్రపంచమునఁ

క్షేమతత్త్వప్రచారమున కిది మొదలు. ఈ విశ్వమునంతను గరుణతో నార్ద్రిమొనరించి పతితమానవులకు మానవ ధర్మం బుపదేశించి సముద్ధరించెద. ఈ పక్షిని విడువను. దేవదత్తా! కావలసిన నీసంశయము విడుటకై పండితసభను బ్రశ్నింపు"మని చెప్పి దానితోఁగూడ నిజమందిరమునకుఁ జేరెను.

మఱునటిదినము రాచదర్బారులో పండితసభ జరి గింపఁబడియెను. అందు రెండు పక్షంబులుగా నందలి పండితు లందఱు నిరువురు రాజకుమారుల పక్షంబున వాదోపవాదం బులు జరిపిరి. పెద్దయుంబ్రొద్దు గడచెను. కాని వారిదమిత్థ మని నిర్ణయమునకు రాఁజాలరైరి. అంత నా సభామధ్యము నుండియొక వృద్ధసన్యాసి లేచి, "ప్రాణమున కేమాత్రమైన విలువయుండినఁ బ్రాణములు తీయనుంకించినవాని చేతుల లోనా దానిని బడవేయనుంకించుట? ప్రాణదాతకే యా రక్షింపఁబడిన పక్షి చెందుట సత్యము. బాణము వేసినవాఁడు దాక్షిణ్యరహితుఁడై హింసామతి వస్తునాశనము కాంక్షిం చును. అట్టివానికా మీరు తీర్పునిత్తు?" రని యుత్కంఠమైఁ బల్కెను. అందఱు నయ్యదియే సమంజసమని యొప్పు కొనిరి, సిద్ధార్థుఁడు విజయవంతుఁడాయెను. తనచేఁ బ్రాణ రక్షణము కావింపఁబడిన యాయండజము స్వేచ్ఛగా విహా యసమార్గమున కెగసి తోడి కపోతములఁ గలిసికొనెను. ఆవృద్ధతాపసియు పలితభోగుఁడైన నాగేంద్రుని మూర్తి ధరించి తిరోహితుఁడాయెను.

అంతఁ గొంతకాలమునకుఁ బృథివీపతి తన తనయుం జూచి, "నాయనా? ఈ వసంతకాల మెంత మనోహర మైనది! మన విశాలసామ్రాజ్యమంతయు నొకపరి పర్య టించి రావలయును జుమా! ఫలసస్యసమృద్ధమైన మన ధరామండలమంతయు నొకమాఱు చూచిరమ్ము. నాయనం తరము భూభర్తవై యీ ధరణీభారము భవదీయభుజా స్కంధముల వహింపవలసినవాఁడవు, ముద్దుతండ్రీ!" యని చెప్పి తగిన సేవకులనిచ్చి రాజకుమారునిఁ దిరుగఁబంపెను. సిద్ధార్థుఁడు రథారూఢుఁడై పల్లెలు పట్టణములు, వనములు నుద్యానవనములు బర్యటించెను. కృషీవలులు దమ చాక చక్యము బయలుపడ భూమిదున్ని విత్తులఁ జల్లుచుండిరి. మొలచిన మొక్కలు మొలచుచున్నవి. పుష్పించెడు వృక్షములు పుష్పించుచున్నవి. భూమి పచ్చనిచీర ధరించి కన్నులపండు వొనరించుచుండెను. కాని యీ యానంద దృశ్య మనంత వ్యథతో నిండియుండెను. కాడి మోయలేక యెద్దులు కాయలుకాచిరక్తస్రావముతో బాధపడుచుదున్న లేక దున్ను పశువులను, ఒకదాని ప్రాణములపై నింకొకటి యాధారపడి యొండొంటిఁ జంపుకొని తిని తమ కాయములఁ బెంచుకొను ప్రాణులను జూచి "ఈ జీవితము సర్వము దుఃఖభాజనము, కంటకసమన్వితము" అని తన భృత్యుల నొకింతకాలము దవ్వులనుండ నాజ్ఞాపించి, యొంటిగా నొక వృక్షమూలమునఁ బద్మాసనాసీనుఁడై యీ ప్రాపంచిక సాంసారిక మాయాతీతసత్యము నెఱుంగఁగోరి ధ్యాననిష్ఠ

వహించెను. ఆ సమయంబున గగనమార్గంబునఁ జరించు దేవర్షిగణ మామాయాబాలకమూర్తి నుండి వెలువడుచున్న యనంత తేజస్సుచే సాకర్షింపఁబడి, వచ్చి, యామహాత్ముని దర్శించి, యయ్యనఘుని యనంతగుణంబులఁ బ్రశంసించి చనిరి.

సూర్యభగవానుఁడపరాద్రి చేరుచుండెను. కుమారుఁడింకను నిలుచేర లేదని రాజు బయలుదేఱి వెతకుకొనుచు వచ్చి యా వనమధ్యమున నొక వృక్షమూలమున నిమీలిత నేత్రుఁడై, ధ్యానపరుఁడై యున్న తనయునిఁ బొడగాంచెను. అది సాయంసమయమగుటచేఁ దరుచ్ఛాయ లమితత్వరితముగా చలనము వహించుచుండెను. అట్టి తరుణమున నా మహాభాగునకు నెండ తగులకుండ దరినున్న యశ్వత్థ వృక్షములన్నియు గుమిగూడి యొక నిబిడనికుంజముగా నేర్పడి తమ ఛాయచే నాచ్ఛాదించి కాపాడుచుండెను. ఈ విచిత్రదృశ్యముఁ దిలకించు రాజుకర్ణములకు "ఈ రాజకుమారుని హృదయమునుండి విచారచ్ఛాయ దూరమగునంతవఱకీ తరుచ్ఛాయ తలఁగిపో"దను నొక దివ్యాంబర వాణి వినిపించెను.

రాజకుమారుఁడు పదునెనిమిదియేఁడుల ప్రాయము వాఁడాయెను. రాజాతని నిమిత్తము మూఁడు సౌధరాజముల నిర్మింపించెను. అందొకటి శీతకాలమునఁ జలిలేకుండనుండునది ; రెండవది మండువేసవిలోఁ జండభాస్కరుని ప్రచండత కందని చలువఱాతిమేడ : మూఁడవది వసంతకాలమున నివ

సింప నింపెసగు నీలంపుఱాల వింతసౌధము. వీనిచుట్టును విరివిగా ఘుమఘుమలు వెదఁజల్లు నానావిధలతావితానములతోఁగూడిన యుపవనములును, నిర్మలవారి పూరితములగు ఝరీప్రవాహములును విరాజిల్లుచుండెను. అందీతఁడానందముగఁ గాలక్షేపముఁజేయ వింతవింత వినోదము లేర్పఱుపఁబడెను. చకచకలాడెడు చక్కని వయస్సు, సకల సౌఖ్య సౌభాగ్యముల నీను సంపూర్ణ సంపదలుఁ గలిగియుండియు నిరంతరం బాతని మనస్సు మేఘాచ్ఛాదితమైన యాకసము చాడ్పున నుత్సాహరహితంబై యొప్పుచుండెను. ఎట్టి వినోదముల నాతఁడు పాల్గొనఁడు, ఏ వికాసమును మోమునఁ దోపనీయఁడు. ఎల్లప్పుడును మనస్సునం దాతఁ డేదియో యాలోచించుచు ధ్యానాయత్తచిత్తుఁడై మెలఁగుచుండును.

కుమారుని వింతచర్యల నవలోకించి రాజతివికల మనస్కుండయి మంత్రుల రావించి వారితో "అమాత్య పుంగవులారా! ఆనాఁడావృద్ధతపస్వి యాడిన పలుకులును, స్వప్నశాస్త్రజ్ఞు లాస్వప్నమున కన్వయించిన యర్థమును నొకపరి జ్ఞాపకము దెచ్చుకొనుఁడు. నా హృదయరక్తము కన్నఁ బ్రియతముఁడైన నా యీ తనయుఁడు శత్రువిజయముగాంచి రాజరాజయి భూచక్రంబంతయు నేకచ్ఛత్రాధిపత్యముగా నవక్రపరాక్రమంబున నేలుటొండె, లేదా సర్వసంగపరిత్యాగ మొనరించి సకలభోగములఁ బరిత్యజించి నిరంతర విచారసాగరనిమగ్నుఁడై మనుటొండెఁ జేయు. అనుభోగ్యంబులైన వివిధసౌఖ్యసంపదల నెడఁబెట్టి విరక్త

చిత్తుఁడై సన్న్యసనంబు గ్రహించిన తరువాత నేను ప్రాప్త మగునో యెవరి కెఱుక ! మీఱు మహాత్ములు, బుద్ధిమంతులు, కార్యసాధనధురంధరులు. నా కిప్పుడు చేయ వలసిన కర్తవ్య మెఱుంగఁ జేయవలయు''నని వారిని గోరెను. అందుపై వారిలోఁ బెద్దవాఁ డిట్లనియె : ''మహారాజా! ఇట్టి వికారచేష్టలను బ్రేమ చక్కఁ బెట్టును. సుందర తనూ విలసద్విలాసినీ ప్రణయరజ్జువులచేత నీ కుమారుని హృదయము బంధింపఁ జేయుము. స్వర్గమునైన మఱపించు విశాల మీనలోచనములు, అమృతము చిలుకు నధరము మున్నగువాని సౌందర్యమనిన నీతఁ డేమి రుచి యెఱుంగును ? మనోజ్ఞమూర్తులైన కాంతాసమూహముల నీతనికి జత చేయుము. హృదయ మాకర్షించి దోచుకొను నంగనామణులనిచ్చి యుద్వాహ మొనరింపుము. లోహశృంఖలములచేతనైన బంధింపరాని భావసంచయమును సహితము రమణి తన రమణీయ కేశపాశమున ననాయాసముగాఁ గట్టి వేయఁ గలదు.'' ఈ యాలోచన కందఱును సమ్మతించిరి కాని రాజున కా కార్యము సాధించుట కవకాశము కాన్పింప లేదు. తమ కనుల కందముగాఁ గాన్పించిన పిల్లలఁ దాము సమ్మతించి పెద్దలమను నహంకారమునఁ గట్టఁ బెట్టినచోఁ నా కన్యలాతని హృదయమాకర్షింపఁ జాలక పోవచ్చును. అట్లుగాక పదిమంది పెండ్లికుమార్తెలఁ జూపించి 'నాయనా ! నీ మనస్సునకు నచ్చిన పిల్ల నెంచుకొనుము. పెండ్లి చేసెద'మనిన నొక చిఱు నవ్వుతో బ్రణయసౌఖ్యము రుచి నెఱుంగని చిఱుతప్రాయంపు

రాకుమారుఁడాయంగనలపొందుఁద్రోసిపుచ్చునేమో ! ఎట్లా తని నొడంబడఁజేయుటయా యని సంశయమునఁ గుందు రాజుం గాంచి వేఱొక మంత్రి "రాజా ! రాజనగరమున నొక వింత పండుగ చాటింపవలయు. అందు రాజ్యమందలి యసదృశతనావిలాసినులైన కన్యకామణులు కేళీవినోద ములఁ బాల్గొనవలయును. వారినందఱను మన రాజకుమారుఁ డనేక బహుమానములిచ్చి బహూకరింపవలయును. ఏతత్సం దర్భమున నే యంగనామణి యాతని హృదయము నాకర్షించి విచారమగ్నమైన యాతని వదనపద్మమును వికసింపఁజేయునో రహస్యముగాఁ గనిపెట్టి యావిలాసినినిచ్చి యాతనికిఁ బెండ్లి చేసిన సర్వము చక్కఁబడుఁ"నని మంత్రాంగమిచ్చెను. అందఱు నది సరియనిరి.

కపిలవస్తువున నుత్సవము చాటించిరి నగరమంతయు వింతగా నలంకరింపఁబడెను. వీటఁగల సుందరమూర్తు లందఱు వాటఁ బాల్గొనుచుండిరి. అందున్న యేకైక పురుషుఁ డా రాజకుమారుఁ డా వినోదములఁజూచి చూచి చివర కాకన్య లకు నిర్దిష్టబహుమానము లొసంగఁ బ్రారంభించెను. సమాధి గతుఁడైన సన్యాసివలె వికారరహితుఁడై పద్మాసనాసీనుఁడై యున్న సిద్ధార్థుని ముఖము వీక్షింపనైన సాహసింపక యర్ధ నిమీలితనేత్రములతోడనే కాంతలు తమతమ బహూకృతు లందుకొని వెడలిపోవుచుండిరి. ఉత్సవము పరిసమాప్తినొందు సమయ మాసన్నమాయెను. తరుణీమణుల సంఖ్య తఱిగి పోవుటయుఁ జివర కొక్కకన్యాతల్లజమే మిగిలెను. దివ్య

సుందరవిగ్రహముతోఁ జకితకురంగీలోచనములతో, శర
చ్చంద్రచంద్రికల వెదఁజల్లు ముఖచంద్రునితో నపర రతీ
సతియో యనునట్లు యశోధరాదేవి రాజకుమారుని సమీ
పించి, యతని చూపులలోఁ జూపునిలిపి, "ఆర్యకుమారా!
నాకేమిచ్చెద"వని యడిగెను. రాజకుమారుఁ డాపటుకుల
కలరి బంగరుపళ్లెరమునఁ గానుకలు కరవై యుంట గ్రహించి,
తన మెడలోని పచ్చలహారముఁదీసి. యామె కుసుమకోమల
మైన మొల నలంకరించెను. చూపులే మరుని తూపులాయెను.
ప్రేక్షణమాలికా మధుకరీపుంజమునుండి ప్రణయమంజుల
గానములు స్రవించెను.

సిద్ధార్థుడు బుద్ధుఁడై లోకోద్ధరణార్థము నవధర్మ
ప్రచారముచేయుకాలములో నెవరో, "ఆర్యా! ప్రథమ
వీక్షణసమయముననే ఆ శాక్యకన్యపై ననురాగ మేల
జనించె"నని ప్రశ్నింప "మాప్రణయ మపూర్వమయ్యు నపూ
ర్వముకాదు, మాపరిచయ మనేక జన్మాంతరములది"
యని భగవానుఁడు ప్రత్యుత్తర మొసఁగెను.

రాజీ సంతోషవార్త నెఱింగి యెట్టకేల కదృష్టవశ
మున రాకుమారుని మన స్సాకర్షింపఁ గలిగిన లతాంగి లభ్య
మాయెనని వెంటనె శాక్యప్రభువునొద్దకు 'సిద్ధార్థునకు
యశోధర నీయవలసిన'దని యర్థించుచు వార్తనంపెను,
శాక్యవంశ సంప్రదాయానుసారముగా స్వయంవరములో
నే రాజకుమారుఁ డశ్వారోహణమున, విలువిద్యయందు, కత్తి
సాములో తోడివారలలో నిపుణుఁడై వన్నెకెక్కిన వానికే

వరింపవలయును. ఆ యాచార మెట్టి విపరీతపరిస్థితులలోఁ గూడఁ బరిత్యజింపరానిది. ఈ వార్త రాజునకుఁ దెలిసెను. రాజకుమారుఁడా యశోధరను దప్ప నన్యల నుద్వాహమాడ నని శపథము వహించెను, నిరంతర మంతఃపురముననే కాలముపుచ్చు సిద్ధార్థుఁడెక్కడ? ఈకఠినపరీక్షలో నుత్తీర్ణుఁడగు టెక్కడ? చాపవిద్యలో మిన్నయైన దేవదత్తుఁడు. అశ్వారోహణమున నేర్పరియైన అర్జునుఁడు, కత్తిసాములో నసమానకౌశలంబు గడించిన నందుఁడు నుండ వారిముందు సిద్ధార్థుఁ డెట్లు యశోధరను జయించుకొనఁగలఁడని రాజు కెం తయు వంతఁగుందఁజొచ్చెను. అంత సిద్ధార్థుఁడు తన తండ్రితో 'వెంటనే స్వయంవరము చాటఁబంపు'మని ప్రార్థించెను.

నాఁటి కేడవనాఁడు యశోధరా స్వయంవరమహోత్సవము. పురబాహ్య కేళీ ప్రదేశమున సర్వాలంకారములు గావించి వరపరీక్షార్థము సర్వసన్నాహములును గావింపఁబడెను. సువర్ణపుష్పాలంకృత సిత వృషభ రాజములఁబూన్చిన రథము నారోహించి యశోధర నిర్ణీతసమయమున కరుదెంచెను. రాజకుమారు లందఱును వచ్చిరి. అంత సిద్ధార్థుఁడు కంటకం బను తన తెల్లని వాజి నధిరోహించి విచిత్రబాహ్యప్రపంచము నవలోకించుచు, పుట్టుకలో నేవిధమైన వ్యత్యాసము లేకున్నను, అవస్థాభేదములు కలిగినవారిని, సుఖదుఃఖముల నసమానముగా ననుభవించు రాజప్రజలను వింతదృష్టిఁ దిలకించుచు వచ్చి చేరెను. యశోధరా తనూద్యుతులు తన కనుఁగొలంకుల మెఱయ గుఱ్ఱముదిగి "ఈ

యాణిముత్యమును గంఠహారమున ధరించుటకు, ఈ మణి కౌస్తుభమును వక్షస్థలమున నలంకరించుకొనుటకు, ఈ కుసుమరాజమును వాలిఁబూనుటకుఁ బురుషోత్తమునకుఁ దప్ప నధికారము లేదు. తొడిపందెకాండ్రే నా యాధిక్యము నిర్ణయించెదరుగాక" యని స్వయంవరపరీక్షకు సంసిద్ధుఁ డాయెను.

ధనుర్విద్యాపరీక్ష ప్రారంభమాయెను. నందుఁడొక కంచుఢక్క నొక యారుగొవ్వుల దూరమునుండి భేదించెద నని పందెము వేసెను. అర్జునుఁడు నల్లే యొడనెను. దేవదత్తుఁడు తాను మఱి రెండు గొవ్వుల దూరమునం దుంచినను గుఱి తప్పననెను. సిద్ధార్థుఁడు తన గుఱి పదిగొవ్వుల దూరమునం దుంచ నాజ్ఞాపించెను. నందార్జున దేవదత్తులు తమ తమ ప్రతిజ్ఞలు నిలుపుకొనిరి. చూడవచ్చిన ప్రజలందఱు నాశ్చర్యచకితులైరి. ఇంక సిద్ధార్థునివంతు మిగిలెను. అతని లక్ష్యమాయమితదూరమునుండి చిన్న జాజికాయ చిప్పవలెఁ గాన్పించుచుండెను. లక్ష్యము తప్పక యాదూరమునుండి యా కంచుఢక్క పగులఁగొట్టినేని విజయము సిద్ధార్థునిదే; కాని యెట్లది యనుకూలపడును? చూపరుల హృదయములన్నియు సంశయనిస్పృహాలతో నిండిపోయెను. యశోధరా కన్య యెట్టి విపద్దృశ్య మాలోకింపవలసివచ్చునో యని భీతహరిణేక్షణముల కడ్డుగఁ బ్రకంపిత హస్తపద్మములతోఁ బసిఁడిముసుంగు ముందుకులాగెను. సిద్ధార్థుఁడును కుమారత్రయముచే నుపయోగింపఁబడిన విల్లంది, ముఖచంద్రుఁడు

ముసిముసినగవుల వెన్నెలలు వెదజల్లుచుండ గంధసింధు రంబు చెలకుగడ నెత్తుగతి నెత్తి యెక్కిడినంతనే వింటి కొప్పులు రెండు నతిసులభముగ నొండొంటిం దాకి యా ధనువు భగ్నంబాయెను. తోడనే సిద్ధార్థుని మోము జేవు రింపం గ్రోధగాంభీర్యముల కాటపట్టయి, "బాలుర విలా సార్థ ముపయోగించు నీ నిర్వీర్యపు బెండువిల్లా లభించినది! శాక్యప్రభువుల ప్రజ్ఞాగౌరవముల కుచితంబైన ధనువే లభింప లేదా" యను వాక్యముల నుచ్చరించెను.

సభయందంతటను గుసగుసలు ప్రారంభమాయెను. నందాదుల ముఖములు వివర్ణములై యసూయాద్వేషముల వెలిగ్రక్కుచుండెను. అంత వారందఱాలోచించి, యెన్ని యో వర్షములనుండి యాలయగుప్తమైయున్న 'సింహహానుని' మహాత్తరదివ్యధనువును బెక్కురు వాహకులచే దెప్పించిరి. అంత సిద్ధార్థుం డా విల్లొకపరి యించుక పరీక్షించి తన సోద రులం బ్రయోగప్రయత్నమునకుం బ్రోత్సహించెను. విల్లెత్త లేనివాం డొకండు, కదల్పలేనివాం డొకండు, విల్లత్రిప్రయాస మునం గొంచెమెత్తియు నెక్కు పెట్టలేనివాం డొకండు నై వారు వెలవెలబోయిరి. అంత సిద్ధార్థుం డోరగా వంగి సునాయాసముగా నొంటిచేత నావిల్లెత్తి నారిసారించిన నా గుణరవంబునకు భూనభంబు లదిరెను. శరము సంధించి యేయ నది మనోవేగమున లక్ష్యమును దాంకి, వినిర్భిన్న శాఖా బహిర్గతమై, చూపానని దూరమున నదృశ్య మాయెను.

పలుకరింప, భావోద్వేగము నాఁగి, దివ్యమూర్తి నుపసంహరించి సహజసౌమ్యస్వరూపమున, మందస్మిత వదనారవిందుఁడై నిజదేవిని వీణ వాయింపఁగోరి యామె యశ్రువుల నరికట్టును. ఆ వీణారవంబున సామాన్యజనంబులు సంగీతమునే యాలకింతురుగాని సిద్ధార్థుఁడు సర్వసుపర్వ ప్రబోధ మాలకించును.

"విహాయసమార్గమున నిరంతరమును తెలివిలేక లోకసంచారము [illegible]ంచు సమీరకంఠస్వరములము ; శాంతికొఱకు ఘోషించినను మా ఘోషయే మాది కాని శాంతి దొరకదాయె, యథా వాయు స్తథా మర్త్యజీవితం. అంతయు నొక ఘోష ; ఒక విషాదనిశ్వాసము ; ఒక కల్లోలము : ఎక్కడనుండి రాక, ఎక్కడికిపోక. జననమరణంబుల మర్మంబేమి? అనిర్వాభకములైన జన్మపరంపరల వలన లభ్యంబగు నానందమేమి ? ఈ యానందములో నీకుఁ గల సంతోషమేమి ? ఈ ప్రణయము నిత్యమై యానందస్థాన మనుకొందము కాని జీవితవిధానము మాఱుచుండు తీగలపైఁ బ్రవహించు వాయువుచేఁ గల్గు స్వరములవలెఁ దాత్కాలికమే ! ఓ శాక్యకుమారా! లోకసంచారులమైన మాకెక్కడి నిష్ఖేదానందము ! సకలప్రపంచము దుఃఖసముద్రమున మునిఁగియున్నది ; కన్నీటికాలువలు కార్చుచున్నది. ఈ నిర్భరవిషాదములోనే, మీకు వికటాట్టహాస మగుచున్నది. పాపము! పట్టుకొని ప్రాఁకులాడు నీ జీవిత మంతయు నట్టి మాయ యని యెఱుంగరు కదా!

భూనభమ్ములఁ బరుగులెత్తు ఝురీమేఘంబుల నాగవచ్చునే ! ప్రభూ! జగద్రక్షకా! ఖేదబాధలలో మునిఁగిపోయిన ప్రపంచము నుద్ధరించి రక్షించు సమయ మాసన్నమైనది. ప్రబుద్ధుఁడవు కమ్ము తండ్రీ! ప్రణయము నైహికసౌఖ్యాలాలసులైన ప్రణయమూర్తులకై విసర్జించి దుఃఖార్తులకొఱకు రాజ్యరమను బరిత్యజించి ప్రపంచమునఁ బర్యటించుము ? లోకమును సముద్ధరింపుము ; చిత్తమునకు శాంతి గడించుము. ఇదే మా ఆశయము ; ఇదే మా ఆదేశము.''

ఏతద్వాయుగీత శ్రవణానంతరము సిద్ధార్థుఁ డొకనాఁటి సాయంకాలము యశోధరాసహితుఁడై పుష్పారామమునఁ జలువఱాతిన్నెపై నాసీనుఁడై యుండగా నొక చెలికత్తియ వీణ వాయించుచు రాజదంపతుల వినోదార్థము సహజమంజుల స్వరముతో నొక కథ నాలపించెను. రాగరసముతోఁ బాటు కథామృతము సిద్ధార్థుని హృదయకుహరముఁజొచ్చి యానాఁటి వాయుగీతమును జ్ఞప్తికిఁ దెచ్చెను. తన విహారవనముదాఁటి ప్రపంచము లేదనుకొనువానికి హృదయ మొకపరి ఝంఝామారుతముచేఁ గదల్చినట్లాయెను. సుఖదుఃఖములచేతను, ఖేదమోదములచేతను నిండియున్న యా విశాలప్రపంచమున నొకపరిఁ దిమ్మరి రావలెనని యభిలాష వొడమెను. దినపతి సూర్యభగవానుఁడు స్వర్ణమార్గగామియై నిజప్రసాదరోచిస్సులఁ బ్రాతస్సాయముల నెవరెవరికిఁ బ్రసాదించుచుండెనో వారందఱిపై నవ్యాజముగ సిద్ధార్థుని ప్రేమ ప్రసరించెను. ప్రణయరజ్జువులచే బంధీభూతమైన నిజహృద

యమునఁ బ్రేయసీ ముఖచుంబన వినోదమున తీఱని యాతన వేదన యొకటి యుత్పన్నమాయెను. "అహా! మన విహార వనమున కావల నీ కంచుద్వారములు దాఁటిన నింతటి బహుళప్రపంచమున్నదా! ఏమేమి ! ఏమేమికలదో నాకుఁ దెలియఁజేయరే" యని పరివృతజనాళినిఁగోరెను. గుసగుసలు ప్రారంభమాయెను. ఎట్టకేల కెవరోయొకరు "కోట; కోట దాఁటిన నగరు; తరువాత దేవళములు. పూఁతోఁటలు, వనములు; వనములు గడచిన విశాలసస్యభూములు, ఆపై మైదానములు, దారుణారణ్యములు; క్రోసులపై క్రోసులు. ఎంత ప్రయాణముచేసిన తరుగు నీ భూమి" యని వెనుక నుండి చెప్పిరి. 'చెన్నుఁడు నా రథము సంసిద్ధముచేయుఁగాక' యని సిద్ధార్థుఁ డాజ్ఞాపించెను.

సిద్ధార్థుఁడు విహారవనమును మఱునాఁడు దాఁట నున్నాఁడని రాజునకు వార్త వెడలెను. రాజు చేయునదిలేక సరేయనెనుగాని జంఘాలికుల "రాఁబనిచి యిట్లు చాటఁ బంచెను: "నేఁడు యువరాజు పట్టణపర్యటనార్థ మరుదెంచుచున్నాఁడు. నగరంబంతయు ననేక విధముల నలంకరింపుఁడు. బధిరపంగ్వంధులు, జరాజీర్ణదేహులు, దారిద్ర్యదుఃఖభాజనులు మార్గముననుండినఁ దొలఁగింపుఁడు. విచార విషాదములు ప్రకటింపక నిత్యకళ్యాణముపచ్చతోరణముగానాతని నఖండసచ్చిదానంద స్వరూపమున నాహ్వానింపుఁడు."

కపిలవస్తు నగరమంతయు వసంతకాలశృంగారవనంబువలె నలంకరింపఁబడెను. శరచ్చంద్ర చంద్రికాధవళ

రోచిస్సులఁ బురడించు మందయానల మందస్మితవదనార విందప్రఫుల్లస్యందమరంద మధురకాంతులు సకలప్రదేశం బుల యువరాజు నాహ్వానించుచుండెను.

ఘనసార, పటీర, మరాళ, మల్లికాతుషార కాంతుల నొప్పు నాలుగు హయంబులఁ బూన్చిన చిత్రమాలికాలం కృత రథం బారోహించి చెన్నుఁడు సారథియై నడుప సిద్ధార్థుఁడూరేగ బయలు దేఱెను. అతఁ డెక్కడి కేగినను గలకలలాడుచుండెను. సర్వమును వంతోషమయముగాఁ గనుపించెను. "నారాకచేఁ బట్టణ మిట్టి యానందమయ స్వరూపమనుకరించెనా, లేక ప్రపంచమంతయు ననవరతా నందమగ్నమా;" యని మది నాలోచించుచు, జయజయ ధ్వానములమధ్య ముందుకుసాగి చనెను. అంత కొంత దవ్వేగి నంత నొక ముఁడుకాళ్ల ముదుసలి చేతికఱ్ఱ నూఁతగొని, వయసుచే వణఁకులాడు దేహముతో, మాంసరహితాస్థుల నంటుకొనిపోయి ముడుతలువారిన చర్మముతో, వర్షభార మున వంగిన నడుముతో, నతిక్లేశసంజనిత బాష్పప్రవాహ మున నెఱ్ఱవారిన కంటిగుంటలతో, బోసి నోటితోఁ, జింకి గుడ్డలతో, 'బిచ్చము బాబయ్యా! ధర్మము బాబయ్యా!' యనుచు సందడిసమయ, మిదే మంచిసమయమని యువరాజు చుట్టును మూగిన జనసమూహమును ద్రోసికొనివచ్చెను. ఎవరోయొకరు వానిని వెనుకకు నెట్టఁజూచిరి. ప్రక్క లెగుర వేయుచు, దగ్గుచు, ఆయాసపడుచు, "ధర్మము బాబయ్యా! ధర్మము! ఈయఁదలఁచుకొన్న దేదో యీవేళనే ఇండి.

ముసలివాఁడను బాబయ్యా! చచ్చిపోవుచున్నాను. రేపో యెల్లుండో నాపని సరి'' అని వేఁడుకొను నార్తనాదము సిద్ధార్థుఁ డాలకించి, వాని వారించువారిని వారించి, తన సారథిని జూచి "చెన్నా మానవమూర్తిఁ దాల్చియు నింత దారిద్ర్య విచార భయంకర స్వరూపము దాల్చిన యితఁడు నిజముగా మానవుఁడేనా? అప్పుడప్పుడిట్టివారుకూడ మానవులలో జనింతురా? రేపో, యెల్లుండియో తాఁజనిపోవునఁట! అనిన నర్థమేమి? ఆస్థిపంజర మిట్లు పొడచుకొనివచ్చుట కింతమాత్ర మాహారము లభింపలేదా? ఈ క్షుద్రజీవి కేపనుల్ సంభవించె''నని యా వేదనా సంకేతహృదయ ముతోఁ బ్రశ్నింపఁ జెన్నుఁ డిట్లుత్తరమిచ్చెను. "యువ రాజా! ఈతఁడొక వయోవృద్ధు. ఎనుబదివర్షములక్రిత మీతఁడు సకల సుందరాంగుఁడే. ఆ దినములలో నీతని నడుము వంగిపోలేదు; కనులు గుంటలు పడలేదు; చర్మము ముడుతలు పడలేదు; పండ్లూడిపోవలేదు. కాని వయస్సు దొంగవలె నీతని పటుత్వము పీల్చివైచినది; మనోబలమును మాటడంచినది; ధీశక్తి దీసివైచినది; ఈ దివ్వెలోని తైల మాఱిపోయినది; వత్తి నల్లగాఁ గాలిపోవుచున్నది; ఈ ప్రాణజ్యోతి యంత్యదశలో నొక వెలుఁగు వెలిగి యారిపోవ సిద్ధముగా నున్నది. వయస్సున్న దిట్టిదే! రాకుమారా, దీనికై నీ వింత శోకింపనేల?'' ఈ పలుకు లాలించిన తోడనే "చెన్నా! ఈయవస్థ అందఱకును సంభవించునా?'' యని ప్రశ్నించెను "ఎనుబదివర్షముల ప్రాయమువఱకును

జీవించిన నాకును, నాప్రేయసియైన యశోధరకును, మా చిన్నికుమారునకునుగూడఁ బ్రాపించునా'' యని శోకించెను. 'ప్రభూ! ఔ'నని చెన్నుఁడుత్తరమీయఁగనె ''నే ననుకొనిన విషయములఁ దిలకించితిని; ఇఁక రథము మరల్చు. మింటికిఁ బోవుద''మని పల్కెను.

సిద్ధార్థుఁ డంతఃపురము ప్రవేశించెనుగాని మనస్సు మనస్సులో లేదు. ఖిన్నవదనుఁడై విచార హృదయముతో ఫలాహారము నిరాకరించుటయుఁ, గన్నెత్తి యంతఃపురప్రవీణ తరుణీమణు లొనర్చు నాట్యమును దిలకింపమియుఁ, బెదవులు విప్పి యొక్క పలుకైనఁ బలుకమియుఁ గనిపెట్టి యశోధర నిజాధినాథుని పాదపద్మములఁ జింతాక్రాంతయై వ్రాలి, ''నాథా నా యనురాగ కుసుమమునందలి యానందరసము, సౌఖ్య సౌరభము కృశించిపోయెనా!'' యని కనుఁగొలుకుల బాష్పబిందు సందోహము చిందులాడఁ బలుకరించెను. ''ప్రణయసౌఖ్యమును దలంచుకొనిన నా హృదయము వ్యథ నొందుచున్నది. ఒకానొకనాఁటి కది యంతమగును గదా! అది యనిత్యమేకాని నిత్యమైనది కాదే! నీవును, నేనును గొంత కాలమునకు వృద్ధాప్యమును బొందమా! ప్రేమ యారి పోవదా! వికలాంగులమై ముసలితనమున నసహ్యాస్వరూప ములను దాల్పమా! రాత్రింబవళ్ళు మన ప్రణయజీవితముల హృదయములో బంధించి యధరద్వార కవాటము బిగించి చుంబన ముద్రాంకితము చేసి భద్రపఱచి యవినాభావమున మన మింతదనుక మెలంగమా! కాల మిద్దఱమధ్యను బల్ల

వంతమున జొచ్చుకొనివచ్చును. కాళరాత్రి యా గొజ్జంగి కాంతుల నెరికిం దెలియకుండ నపహరించి వాడఁజేయునట్లు నాయౌవనోద్రేకమును, దారుణ్యలావణ్యములును గాలగతిని సమసిపోవును. ఈ విషయ మెఱింగిన సమయమునుండి నా హృదయము భయ విహ్వలమై పోయెను. కాలాంతకుని చౌర్యమునుండి ప్రేమ తన మాధుర్యము నెట్లు రక్షించుకొని చిరంజీవిగా నొనర్చునా యను పరమరహస్యముపై నే మనస్సిప్పుడు మగ్నమైయున్న''దని నిజసతికిఁ దెలియఁజేసెను.

సిద్ధార్థున కారాత్రి నిద్రలేదు; దుఃఖభారమున మనస్సు క్రుంగిపోయెను.

అదేసమయమున మహారాజునకు దుఃఖస్వప్నములు కలిగెను. ఆతఁ డేడు దృశ్యములను గాంచెను. అవి యన్నియుఁ జెడుగు నాపాదించునవియే యని అతివిచార గ్రస్తుఁడై దర్బారులోని పండితుల రావించి యా కలల యర్థముదుగ నొకఁడును నిదమిత్థమని చెప్పఁజాలకపోయెను. ''నా కనర్థము రానున్నది. నా కొక్కరును సాయముచేయ సమర్థుఁడు లేఁ''డని వారిపై నాగ్రహముచెంది వారిని బంపివేసెను. అట్టి సమయమున ద్వారికుఁ డొక మృగచర్మధారియైన ముదుసలి సన్యాసి నొకని రాజుముందు దీసికొని వచ్చెను. రా జాతనికి సాష్టాంగ దండప్రణామం బాచరించి యభ్యుత్థాన మొనరింప నా తపస్వి యాతని నాశీర్వదించి ''నీ కలల ప్రభావముఁ జెప్పెద, వాని నా కెఱుంగఁజెప్పు''మన రాజంతయు సవిస్తరముగా నెఱిఁగించెను. అంత నా సంయమి

వరుఁడానందముచే నుప్పొంగుచు "మహారాజా! ధన్యాత్ముఁడవు. నీ వంశమును, నీ ప్రపంచమును బరమపావన మొనరించు భాస్కరప్రభాతీత భాసమానమైన దివ్యతేజోమూర్తి నీ కుద్భవించెను. ఈయేడు స్వప్నములును జెడ్డ నాపాదించునని భయకంపితుఁడ వగుచుంటివా! ఇవి సత్సంతోష సూచనలు. ఆనందమునకు సమయముకాని ఆవేదనకుఁగాదు. కాలము వచ్చుచున్నది. అమోఘమైన పరిణామము రానున్నది. నాలుగు సుగుణములును నీ కుమారుని సందిగ్ధ సంశయములనుండి విముక్తునిఁ జేసి యానందజ్యోత్స్నలో నవతరింపఁ జేయును. దశవిధలక్షణములు నాతని విజ్ఞానవంతునిఁ జేసి యసదృశశక్తి సామర్థ్యములిచ్చి కోటదాఁటించి, ఏకము నక్షరము పరబ్రహ్మమునైన పరమసత్యము నెఱుంగఁ జేయును. సువర్ణకాంతులఁజిందు ధర్మచక్రముఁ ద్రిప్పుచు, నవధర్మము విశ్వప్రపంచము నిండి భువినుండి దివిఁ బ్రాఁకఁ బ్రబోధించు బుద్ధభగవానుఁడు 'మహారాజా! సెల' " వని తిరోహితుఁడాయెను.

రాజాశ్చర్యమగ్నమానసుఁడై తన కుమారుని యైహిక సౌఖ్యానందలోలమానసునిఁ జేయ నపూర్వ ప్రయత్నము చేయసాగెను. వనవిహారము కంచుద్వారముల మూయ ముడల యొసంగెను. కాని కర్మగతికి విరుద్ధముగఁ దలుపు లెవఁడు మూయింపగలఁడు!

యువరాజునకు కోటకావలనున్న మానవుల జీవితము దర్శించు నభిలాష తిరిగి జనించెను. మానవసౌఖ్య వాహిని

తరంగములు కాలసైకతమున నాగిపోవుచుండిన నెంత యవ్యా
యానందమో కదా! "జనకా! మన పట్టణ మున్నది
యున్నట్లు చూడ వాంఛగలను. దనుజ్ఞ నీయవలసిన"దని వేఁడు
కొనెను. అందుల కతఁ డంగీకరించెను. మఱునాఁడు
మధ్యాహ్న సమయమున కంచుద్వారములు తెఱువఁబడఁ
గోటనుండి యొక సామాన్య శకటమున నొక వరకుఁడును.
వాని తెక్కికుఁడును బయలువెడలిరి. రాజముద్రికకుఁ దలుపు
దెఱచిన యా ద్వారపాలకులు సైత మా కైతవ రక్షకుఁడు
తమ యువరాజైన సిద్ధార్థుఁడే యని యెఱుఁగరైరి. అట్టి
సామాన్య స్వరూపములతోఁ బ్రజలలోఁగలసి వారి కెఱుఁగ
రాకుండఁ బట్టణ పర్యటనము గావించుచుండ వారు చూడని
దృశ్యమే లేదు. వా రట్లు పేట లతిగమించి చనుచు మార్గ
మధ్యమున "పుణ్యాత్ము లెవరైన నాకు సాయపడుఁడు;
నన్ను లేవనెత్తుఁడు; లేకున్న నే నిల్లు చేరుకొనకుండనే మర
ణింతును, తండ్రులారా" యను నార్తనాద మొండు కర్ణ
పుటంబులఁబడ నటుతిరిగిచూచిరి. అచ్చట నొక రోగార్తుఁడు
నరములు కొంకరపోవుచుండ, స్వేదబిందువులు ఫాలభాగము
నుండి జాలులు ప్రవహించుచుండ, సంధివాతకముచే నోరు
వంకరపోఁ గన్నులు లోని యనిర్వాచనీయ దురంత దుఃఖ
సంకటము వెదఁజల్లుచుండ, దరినున్న పచ్చగడ్డి మొలకల
గుప్పిటితోఁ బట్టి లేవఁబోయి లేవలేక తిరుగఁబడి 'చచ్చిపోయి
తిని నాయనలారా' యని బిట్టుమొఱ్ఱలిడుచు వారికి దృగ్గో
చరుఁడాయెను. ఆ దృశ్యము నజూచిలో నుండి పైఁబడవచ్చు

ననర్గళప్రేమ ప్రవాహము ముందుకు గెంట సిద్ధార్థుఁడా రోగి చెంతకుఁ దటాలునఁ బరుగువారి పడిపోకుండఁ బట్టి యెత్తెను. చెంతనున్న చెన్నునిఁజూచి "చెన్నా, ఈతఁ డెందుల కిట్లుండె"నని కుతూహలంబునఁ బ్రశ్నించెను "ఈతని కేదియో రుగ్మత సంభవించియుండనోపు రోగార్తుఁడిట్టి వికారమునే పొంది యంగపటుత్వము భంగమైన చివరకు మరణించు"నని చెన్నుఁడుత్తరమీయ "ననిట్టిరోగములింకను గలవా! నాకును నొకప్పుడిట్టి యవస్థ రావచ్చునా" యని యువరాజు పునఃప్రశ్నంబు గావించెను. "ఇది యొకటియా! అసంఖ్యాకములైన రుగ్మతలు గలవిట్టివి. అవి యెరికైన నెప్పుడైనను రావచ్చును. అంతియే కాదు; వెనుకటినుండి వచ్చి కాటువేసి చంపు కాళవ్యాళమువోలె, పొదలోఁ బొంచి యుండి పైఁబడు చిరుతపులిలాగున, పిడుగువలె నకస్మాత్తుగాఁ బ్రాణి నావేశించి నశింపఁజేయును. ఎవ్వఁడును 'నేనీ రేయి హాయిగా నిద్రపోదును; ఎల్లి వేకువ నిట్లే హాయిగా మేల్కాంతు'నని చెప్పఁగలవాఁడు లేఁడు; ఇంత వింతలు బాధల నొకవేళ సహించి బ్రతికినఁ జివరకా ముసలి తనము తప్పదు; ఆవృద్ధాప్యమునకును మరణమే యవధి" యని చెన్నసారథి విన్నవింప సిద్ధార్థుం డాశ్చర్యఖేద కరుణో ద్విగ్నమానసుఁడై యొకపరి వంచినతల యెత్తఁగనే కనుల ముందింకొక దృశ్య మగుపించెను. ఎదుటఁ గొంతదూరమునఁ గొంతమంది మనుష్యులు గుమికూడి నదీతీరప్రాంతమునకు సాగిపోవుచుండిరి. వారి ముందొక మానవశరీరము వెరుకు

కట్టెల మంచముపైఁ బవళించియుండ, నలుగురును నాలుగు మూలల దానినిబట్టి మోసికొనిపోవుచుండిరి. అంతకుముందొక యువకుఁ డశ్రుపూరితనయనములతో నొక చట్టిలో నగ్నిహోత్రము గొనిపోవుచుండెను. బంధువులందఱు నాక్రందించుచుండిరి. వాహకులు రామనామమే సత్య మను వేదాంతవాక్యము నుచ్చరించుచుండిరి. అంతఁ గొంతసేపటికి వారా నదీతీరముఁ జేరి, కట్టియున్న త్రాళ్లను విప్పి కొయ్యబాఱి పాలిపోయిన యాశరీరము నొకకట్టెల చితిపైఁ బెట్టి నిప్పంటించిరి. అచిరకాలములో నాశరీర మా యగ్నికాహుతియై భస్మమాయెను. ఈ దృశ్యమంతయుఁ జూచుచుండిన యువరాజు చెన్నుంజూచి 'యిదియేనా ప్రతిజీవియొక్కయు చరమావస్థ?' యని ప్రశ్నించెను. ఔనని చెన్నుఁడు సమాధానమిచ్చెను.

సిద్ధార్థుని నయనపద్మములు దుఃఖాశ్రువులతో నిండిపోయెను; క్షితిపై నక్షీణదాక్షిణ్య రోచిస్సులా నయనములనుండి వెలువడుచుండెను. ఒకపరి ఆకసమువంకను, నొకపరి భూమివంకను, మరల నింగిని నాతని దృష్టి ప్రసరించేను. "ఓ దురంతదుఃఖార్త ప్రపంచమా! మరణశోక వాగురాబంధిత మానవజీవితమా! నీ బాధ యనంతము; నీ యానంద మశాశ్వతము; నీ జీవితము మాయ. సౌఖ్యముల పరిధి సంతాపమే. యౌవనమంతయు వృద్ధతనందవలసినదే. ప్రేమప్రళయములోను, జీవిత మపమృత్యుమరణములోనను లయించవలసినదే. మరణానంతర మీ జీవుఁ డింకొక స్వర్గా

పము దాల్చి మరల నీ మాయాప్రపంచమున జనింపవలసిన దే? నేఁటికి నాకంటిని గప్పియున్న పొర విడిపోయినది. నా తోడివారిని, నన్నును దుఃఖవిముక్తులఁ జేసెద. చాలు నీ చూచినది, చెన్నా! ఇంటికి తిరుగు"మని అతఁడు పలికెను.

నాఁటిరాత్రి సిద్ధార్థుఁడు నిజహంసతూలికాతల్పమునఁ బవళించియుండెను. హృదయభారముచేఁ గనులు మూఁత పడలేదు. యశోధరాదేవి చెంత నాసీనయై మనోహరు మనోభారము నిగ్రహింపఁ వీణఁ జేతఁబట్టి మనోహరముగా మంజుల గాత్రము మేళవించి వాయించుచుండెను. కొంత సేపటి కామె యా వీణపైఁ దన మునుఁజెక్కు నానించి యట్లే కనుఁదమ్ముల మొగిడ్చెను ఇంతలో నామె మూఁడు స్వప్నములఁగాంచి, త్రుళ్లిపడి లేచి, నాథుం జేరి "ప్రాణేశ్వరా! యీ దృశ్యత్రయంబు నాకమిత భయంబును గొలుపు చున్నది. ఒక నిష్కళంక శ్వేత వృషభరాజము దివ్య కాంతుల వెదఁజల్లు మణిరాజ మొండు కంఠమున విరాజిల్లుచుండఁ బట్టణవీథులన్నియుఁ బర్యటించి, మెల్లమెల్లగా, పురద్వారము చేరెను. ఎంతయో దానినాప యత్నించినను సాఫల్యము లేకపోయెను. "ఆ వృషభరాజము నాగకున్న పురసౌభాగ్యము జాఱిపోవు"నని యశరీరవాణి దివ్యవాక్కులు కర్ణపుటముల సోకుచుండ నే విని యూరకుండ లేక పరుగు వారి నా బాహులతల దాని మృదులకంఠమునకుఁ బెనవేసి వేదనా రోదనమున వేఁడుకొంటిని. కాని లాభము లేకపోయెను. నన్నుఁగాదని త్రోసిపుచ్చి యది దాఁటిపోయెను. ఇంతలో

నలుగురు దివ్యమూర్తులు సకల దివ్యగుణంబులతోడ దివి నుండ భువి కవతరించి నగరప్రవేశ మొనరించి ధ్వజముపై నున్న యింద్రపతాక మూఁడఁబెటికి సువర్ణకాంతుల వెదఁ జల్లు పద్మాంకిత కేతన మట స్థాపించిరి. ఆ సమయమున నరుణకాంతులు ప్రసరించి బాలభాస్కరోదయమును సూచించెను. ప్రజాహృదయ మానందముచే వికసించెను. కాని,— కాని యాసమయమునకే రోదోంతరాళము నిండ కంపిత కంఠముతో "నిర్దిష్టసమయమాసన్నమైనది! సమయము వచ్చిన"దను హెచ్చరింపు వినఁబడెను. మూఁడవ దృశ్యమేమి వచింపుదును నాథా! నీకొఱకు నేనాత్రముతోఁ దల్పమునఁ దిలకింప నే నీపదధ్యానమున నిరంతరానందమున నే నోలలాడుదునో, ఆ నీ దివ్యమూర్తి. నాబహిఃప్రాణము, నా నాథుఁడు, నాభర్త, నాప్రభు వందుఁ గాన్పింపఁడు. నాకు నోరెండిపోవుచున్నది. కాళ్లు తడఁబడుచున్నవి. నా హృదయము తల్లడిల్లుచున్న"దని తడఁబడు జిలిబిలి పలుకులతోఁ బలుక నాలకించి చిఱునవ్వు మోమునఁ జిందులాడ సిద్ధార్థుఁడు తన మృదుహస్తములతో యశోధరముంగురుల నిమురుచు నామె ననునయించెను. ఆమె ప్రక్కపై బరుండి కనులుమూసెను. నభోభాగమునఁ జంద్రుఁ డమృతకిరణముల వెదఁజల్లుచుండెను. సిద్ధార్థుఁ డకస్మాత్తుగా లేచి నిలఁబడెను. ఆతని కా యమృతకాంతులలోనుండి యమరసందేశము వినిపించినట్లాయెను. "ఈ రాత్రియే మంచిది. ప్రఖ్యాత పథ మాసించెదవా? సత్పథ మర్థించెదవా? రాజరాజవై

మహైశ్వర్య మనుభవింప నిచ్ఛింతువా? లేక సర్వసంగపరిత్యాగ మొనరించి రాజ్యమును, గృహమును విడిచి సన్న్యాసివై యొంటిగా సమస్తవిశ్వము నుద్ధరింప బయలుదేఱెదవా? ఎంచుకొను'' మను ప్రబోధమును. దానివెంబడి నా సమీరగానమును నతని హృదయము నింపివేసెను. తన శయ్యపైఁ బరుండిన యమాయకురాలు—మోహనాంగి—యశోధర నొకమారు తిలకించెను. ఆ చెంతనే పసిఁడి యుయ్యాలలోఁ బరుండిన తమ ప్రణయఫలమును, పుత్రరత్నమును దిలకించెను. చంచలహృదయమును జిక్కఁబట్టెను. భార్యాసహితతల్పమునకు ముమ్మారు ప్రదక్షిణ నమస్కారములు గావించెను. మోహలతాబంధము లతిప్రయాసమున సడలించుకొనెను. మఱుక్షణమున నాతఁ డంతఃపురమును బాసి కోటగుమ్మము చేరెను. అడుగుల చప్పుడు కాకుండ దేవతలు దివినుండి పుష్పవర్షము కురిసి మార్గమును మృదులలతాంతతాంతముగాఁ జేసిరి. ద్వారకవాటములు తమంతఁ దాము తెఱువఁబడి మహాత్మునకు మార్గముఁ జూపెను.

సిద్ధార్థుఁడు కాషాయవస్త్రములు ధరించి ముక్తసంగుఁడై పరివ్రాజకుఁడై విశ్వమం దెచ్చటనైన నాసత్యము, ఆ యక్షరానందము లభించునాయని సృష్టితత్వమెఱుంగఁ బాదచారియై, పల్లెలు పట్టణములు, పురము లరణ్యములు, కొండలు గోపురములు పర్యటించి బింబిసారరాజ్యము చేరెను. మధ్యేమార్గమున నొకస్త్రీ యొక చంటికుఱ్ఱవానిని నిజవక్షఃస్థలమునకు హత్తించి దుఃఖార్త్తయై యశ్రుకణములు ముఖ

పదమ్మును మలీమస మొనరించి చనుఁగట్టుపయింబడ నోదిం చెచుఁ గుమారమహర్షి పాదపద్మములకుఁ బ్రణమిల్లి "తండ్రీ! చుయ్యేకైక కుమారుఁడు, ఈ చిన్ని పాపఁడు మరణించెను. వీనీ, విడిచి నే బ్రతుకలేను. దయామయా! నా ముద్దుల మూఁటను బునర్జీవితునిఁ జేసి నా కొసంగవే! నీకుఁ జేయరాని కృత్యమేలే' 'జని మొఱ్ఱపెట్టుకొన నాదయాసముద్రుఁ డామె నోదార్చి "సోదరీ! తప్పక యట్లే కాని, ఔషధములోని కొక వస్తు వవశ్యము కావలయును. నీవుపోయి యెవరియింటినుండి యైన నొక నల్లటియావగింజ తేవలయును. కాని యా యింట నెవరును మరణించియుండఁగూడదు సుమా! త్వరితముగా వెడలిర" మ్మని యామెను బంపించెను. మఱియొక నాఁడారినే యనేకులు గొల్లవాండ్రు మేఁకలను, గొఱ్ఱెలను మందలుగాఁ దోలుకొనిపోవుచుండిరి. అందొక గొఱ్ఱెపిల్ల యాక్రందించుచుండెను. ఆ రోదనధ్వని తన హృదయకుహరము చించివేయ, నావేదన భరింపఁజాలక యతఁ డా మందలఁ జేరి యందుఁ గాలికి దెబ్బతగిలి నడువలేక రక్తస్రావమున బాధపడు గొఱ్ఱెపిల్ల నెత్తుకొని యొడలునిమిరి దెబ్బపై నూదుచు నల్లని దాని నల్ల నఁదన యఱ్ఱున వైచుకొని "యెక్కడికీ మందలు పోవలయు" నని ప్రశ్నించెను. "బింబిసారుని యజ్ఞశాల" కని వారుత్తరమిచ్చిరి. "నేనును మీతోడవచ్చెద" నని యట్లేగొఱ్ఱెపిల్ల నెత్తుకొని వారివెంటఁబయనమాయెను. ఆసమయమున నావగింజకై యరిగిన యామె యెదురాయెను. మహానుభావుఁ డామె నెట్లు మఱచిపోవును? ప్రపంచమున

కంతకును నామెవలన నుత్కృష్టప్రబోధ మందఁజేయ నిశ్చ యించియుండ నామె నెట్లు మఱచిపోవును? సిద్ధార్థుఁ డామెను "సోదరీ. తెచ్చితివా" యని ప్రశ్నించెను. "లేదు తండ్రీ! మీరు సెలవిచ్చినది యలభ్యము; శశవిషా ణము." అని బదులుచెప్పినంతనే "యేల" యని మరలఁ బ్రశ్నించెను. అందుల కామె "నాయనా. నే నెవరి గుమ్మ మెక్కి యర్థించినను ఏదోయొక మరణార్తియే తెలియఁజేసిరి. ఈ విశాలప్రపంచమున జీవించియున్నవారికన్న మరణించిన వారే యెక్కువగా గనుపించిరి. నేనేమియుఁ జేయంజాలక . సమస్తపుత్రాశలను విసర్జించి నవ్వారాజిల్లని యీ ముద్దు మొగమును, జన్నుగుడువని యీ చిన్ని బాలుని నానదీతీర మున నా తరుచ్ఛాయ డించి, నీ పాదము లాశ్రయించి చిత్త శాంతి వడయుటకై వచ్చితిని దండ్రీ" యని ప్రత్యుత్తర మిచ్చెను. అంత నాతఁ డామెంజూచి, "సోదరీ! నీవితరులకు లభ్యముగాని ఓవ్యౌషధమును గనుగొంటివి. అదృష్టవంతవు రాలవు. ఈ దుఃఖమును నీతో సర్వప్రపంచము పంచుకొను చున్నది. మన మధురప్రేమను విషాదవహ్నిగా మార్చివైచు దుష్టశాపమగు జననమరణ రహస్యమెఱింగి నీ కన్నీటిబిందు వుల నార్పఁగలిగిన నే నెంత ధన్యుడనో కదా! నీ మృత తనయునకు ఖననసంస్కారము గావింపు"మని యామెను పుత్తెంచి, తా నాగొల్లల వెంబడిఁ జనెను.

ఆ రాచతపసి గొల్లవాండ్రతో నటఁ జేరునప్పటికి బిందుసారుని దర్బారుహాలులో నొక మేఁక యజ్ఞపశువుగా

నలంకరింపఁబడి ఘృతసమిత్ప్రజ్వలిత హోమము ముందుంచఁ బడెను. ఒక బ్రాహ్మణ భృగు వద్దాని నొక దారుణాసిచే బలిచేయ సిద్ధంబుగా నుండెను. ఒకక్షణ మాలస్యమైన నా యమాయకపు నోరులేని జీవి ప్రాణము లెగిరిపోవును. సిద్ధార్థుఁడు దూరమునుండియే పరుగువారి "చంపవద్దు, చంపవద్దు రాజా" యనుచు నాకత్తి వ్రేటు వారించెను. అందఱును స్తబ్ధులైపోయిరి. ఆతఁ డామేఁకను గట్లువిప్పి విడిచివైచెను. "రాజా! ప్రాణముదీయ నందఱును శక్తులే. మనలో నొకఁడైనను ఒక్క మృతకళేబరమునకుఁ బ్రాణముపోయఁగలఁడా? ఇందులో నెవరికి వారి ప్రాణము తీపికాదో వచింపుము. దయ యనునది యెంత యమృతతుల్యమైన యమూల్య వస్తువు! దయారహితహృదయము కఠినకర్కశశిలాసమానమేకదా! త్రాగుటకు మధురక్షీరములను, గట్టుకొనుట కున్నిని నిచ్చు నీ యమాయకపుజీవుల మోసముజేసి, వాని విశ్వాసమును వమ్ముచేసి యిట్లు హింసింపఁదగునా! నోరు లేని యీ జంతువుల రక్తముచే నభిషేకించిన నేదైవము మిమ్ముల మెచ్చి కోర్కెలీడేర్చునో చెప్పుఁడు!" అని వచించు నా వర్చస్విమాటల కచ్చటివారందఱును ముగ్ధులైరి. రాజతని సమీపించి చేతులు జోడించుకొని, "మహాత్మా! నిజము. నేఁటిదనుక యజ్ఞబలియని, యాహారమనినిర్దయతో జీవహింస యపారముగా జరుగుచున్నది. అవిద్య తొలఁగి సర్వజీవులయందలి ప్రాణమొక్కటే యను విజ్ఞాన మలవడినది నేఁటికి మీ దయవలన. దయారహితహృదయులకు

మా కెట్లు మీదయ లభింపఁగలదు? నేఁటినుండియు నీ రాజ్యమున నేమిష చేతను రక్తబిందువొకటియుఁ జిందఁబడ''దని ప్రదక్షిణపూర్వకముగా వచించెను.

సిద్ధార్థుని హృదయమునకు శాంతి చేకూరలేదు. అంతయు నయోమయముగా నుండెను. ఆత్మశోధనదీక్ష వహించిననే కాని పరమరహస్య మెఱుఁగరాదని నిశ్చయించుకొనెను. ఇంకఁ దిరుగుట చాలునని గయాసమీపమున నొక యశ్వత్థవృక్షచ్ఛాయఁ బద్మాసనాసీనుఁడై స్థితప్రజ్ఞుఁడై తపస్సమాధిఁ జొచ్చెను. ముప్పదిదినము లుపవాస మొనరించి కావించిన యా తపమ్మునకు ఫలముగా నాతనిలో నొక దివ్యజ్ఞానజ్యోతి ప్రకాశించెను. సర్వమును ద్యోతకమాయెను. లోకోద్ధరణార్థమై ప్రబుద్ధుఁడైన బుద్ధభగవానుఁడు సమాధి చాలించి లేచెను.

శ్రీ బుద్ధభగవానుఁడు ప్రప్రథమమున వారణాసీ క్షేత్రసమీపమున వెలయు సారనాథమునందుపన్యసించి, ప్రబోధప్రారంభమున కుపక్రమించెను. అటనుండు పల్లెలు, పట్టణంబులు పర్యటించి పర్యటించి యాయాస్థలముల ధర్మబీజములఁ జల్లుచు. పండితపామరులు, బ్రాహ్మణనిషాదులు, ధరాఖండలశిబికావహులు, రణధూర్వహభీరువులు—ఎల్లరుఁ గూడిమాడి, కేల్దండలుపట్టి పోఁదగిన మార్గము నుపదేశించుచుఁ, దా మెట్టిన పల్లీపత్తనములు తీర్థములై వెలయ, భవతాపనివారకబోధామృతమును గురియుచుఁ, గపిలవస్తుపురమును జేరెను. పూర్వము చెన్నసారథ్యమునఁ గన[illegible]క

మణిమయరథమ్మున సరిగచేలలు ధరించియూరుపుఁగొండపై నున్న సరోజబాంధవుని యొప్పునఁ దిరిగిన యాపురమ్మున నే మేనఁగావి చీరయుఁ, జేతఁ గపాలయు ధరించి పాదచరత్వమునఁ జనుదెంచు నా చక్కనయ్య నెమ్మొగముఁ గాంచు పుణ్య మిన్నిదినమ్ములకు లభించెను గదా యని పౌరజనమమందానందమున నా మహాత్మునిఁ జేరనరిగెను. వెల్లివిరిసిన నదివోలెఁ బురమంతయు విరిసె. గౌతముని రాక విని, రాచవారెల్లఁ దీర్థమున కేగుపగిది నేతెంచిరి. గౌతమ గమన సమయమునుండి నేఁటివఱకు నిరవధిక శోకమునఁ 'దనయా! తనయా!' యని వాపోవుచున్న వృద్ధభూపతి తడియాఱిన నోటితోడను, దడియాఱని కంటితోడను నా బాలతాపసిని జేరవచ్చెను. కజ్జల కాంతిహీనములైన నయనంబుల బాష్పాంబుకణంబు లురుల, విగతసంస్కారమున జడలుగట్టిన కురులతో, వసివాళ్లు వాడి కంపించు మైతీవతో యశోధర యంతఃపురము వీడివచ్చి, యొకచేతఁ గొడుకు కూఁకటిఁ బుడికికొనుచు, శూన్యావలోకనముల నిజమనఃకాంతునిఁ గాంచుచు, రూపము వహించిన శోకమన దాల నిలిచెను. అంత వారినందఱిని గరుణారసతరంగిత హృదయమున, మమతాభ్రమ లెఱుఁగని శాంతమహోదారకటాక్షమునఁ బరీక్షించుచు నిట్లనియెను: "సతీసుతవ్యామోహమునఁ జిక్కి, జనుర్మృతిసఁ పీడితులై దుస్తరశోకవార్ధిఁబడి క్రుక్కు నార్తప్రాణులైన యోజీవసంతతులారా! క్షణభంగురములైన జీవనవ్రాతమును నమ్మి, మాయామేయ జగంబే సత్యమని

సంభావించి మతిభ్రమమున లోనై యెంగుల కిట్లు సంచరించె దరు? మీ రీ భవబంధకారణముగాని, తన్మోక్షవిధానము గాని తెలియరుగా! హింసారతిమూని పాపమతులై సంచరిం చుట సరికాదు. లోకకళ్యాణప్రదమైన యహింసావ్రతముఁ గైకొని, కామనురాసదమైన బ్రహ్మచర్యదీక్ష తాల్చి, శాంతిదాంతిసంధానములకు సిద్ధాంజనంబైన సమత్వబుద్ధి వహించి.జన్మవిముక్తిమార్గమైనసద్ధర్మపథమ్మునుగమింపుఁ'' డని ప్రబోధింప వృద్ధనరనాథుఁ డంజలిపట్టి ''కరుణాసాగరా! కేవలాపవర్గప్రాప్తి సంధాయిఁ యని నిన్నెఱుఁగఁజాలితి. గురు వరా! యీ దీనునకు ధర్మదీక్షయొసంగు'' మనెను. నిర్వి కారమానస యశోధర పతిపదాబ్జముల వ్రాలెను. బుద్ధ దైవమే శరణము; ప్రశస్తతరంబైన తదీయధర్మమే మాకు శరణమని జనసంఘములు సాగిలంబడిరి

పరమపతివ్రతలైన పౌరగృహిణీమతల్లులు నిత్యం బును సమయము దప్పక సాదరభిక్ష నొసఁగ, కపిలవాస్తు పురీపరిసరవృక్షవాటి నిజశిష్యగణమ్ముతో భగవంతుఁడు కొంతకాలము వసించెను.

అంత నొకనాఁడు బుద్ధభగవానుఁడు రాజగృహ ద్వారము జేరి 'మమభిక్షాం దేహి' యని తలుపుతట్టెను. నల పుల కల్పవల్లికి దోహదక్రియల సల్పుచున్న నామెల ప్రాయపు రాజదంపతుల కర్ణపుటంబుల బుద్ధయోగీంద్రు పిలుపు చొరరాదాయెను శాక్యర్షి యు నవ్యగేహములందు వలె నట నొక క్షణకాలము నిలిచి యస్తి నాస్తి యను

పలుకు వినంబడమిఁ దిరోహితుండాయెను. మునినివర్తనము గాంచిన యొక చేడియ నందుని చెంతకుఁ జని విన్నవించెను. రాసుతుఁడు నిర్వ్యాసనీరయి. తన ప్రాణకాంతముఖమును గనుఁగొనుచు, "దేవీ! అన్న మహామహిముఁడు, జగత్పూజ్యుఁడు. గురుఁడు దైవము; భిక్షవేఁడి, మరలిపోయెనఁట! ఎంత యభాగ్యశాలినో కదా! ఎంత ప్రమాదము పుట్టెను? నీ యనుమతించినఁ బోయి. భగవానుని పాదములపైఁ బడి మగుడఁగొనివత్తు"నని యంజలిపట్టి యనుజ్ఞ వేఁడి, చయ్యన ముని వెంటఁ జేరంజని, నడుముకట్టుకొని వినమ్రుఁడై మహాత్ముని పదసరోజముల సాగిలఁబడెను. "కరుణామయా! నా వలని యపరాధము సైరించి, మరలి చనుదెంచి, మఱఁదలి చేతిభిక్ష గ్రహియింపవే"యని వేఁడుకొనెను. గౌతమ బుద్ధుఁడంత నాఁటి కింక భిక్షాశన మొల్లమి హస్తసంజ్ఞామాత్రమునఁ దెల్పి, చిన్నపుచ్చుకొని 'పోయివచ్చెద'నని వెనుక చక్కికి జాఱుచున్న నందుని నిలునిలుమను చూపుచే నాఁపి, పరివ్రాజకదీక్షకుఁ దొలిశుభంబునాఁ బరఁగు చేతి భిక్షాపాత్రము నా రాజకుమారుని పాణితలమ్మునఁ బెట్టెను. నందుఁడును మౌనియై బుద్ధదేవుని వెంటఁ జనియెను. ప్రేయసీ ముఖవీక్షణ కౌతూహలము చిత్తమును వెనుకకులాగ, గౌతమర్షి యాజ్ఞాభయము నందపాదములను ముందుకు సాగించుచుండెను. కంపుఁడనఁ దరుణీవ్యామోహమోహపాశబద్ధుండై, ప్రాపంచికసౌఖ్యము లసత్యంబని యర్థించి విషయలంపటుఁడై మెలంగు వయస్సు. అదియే సాధారణ మానవతత్త్వము.

నందుని మన స్త్రీవిషయలాంపట్య వైముఖ్యముఁబొందిన మానవజాతియే సముద్ధరింపఁబడునని, మధ్యేమార్గమున భగవానుఁడా నందుం గనుఁగొని "కుమారా! నీ వాసనాపరంపరలు మాసి, విషయోపరాగ దివ్యవిజ్ఞానకళిక సిద్ధించుఁగాక. నీకు భద్రమగుఁగాక" యని దీవించి, "నాయనా! నీకు పరమరహస్య మెఱింగించెద వినుము. పుట్టినదాది మృత్యువు ప్రాణిని వెంటాడును. మరణముఁ దప్పించుకొన బ్రహ్మకైన నశక్యంబన్న మనమాట నుడువనేల? తల్లి యొడిలోని బిడ్డను దస్కరించును. బిగువుఁ గౌఁగిలి తెగఁద్రెంచి ప్రియులఁబాపు మృత్యువునంతటి నిర్దయురాలు మఱి లేదు. జరారుజలు మృత్యుదేవతా నేత్రద్వయము; పరువము బుద్బుదప్రాయము; ముసలితనము పైఁబడిన తన దేహమే తనకు రోఁత గలిగించును; ప్రేయసియే పెనుభూతమగును. ఈనాఁటి ప్రణయప్రబంధములు నాఁటిదనుక నిలిచియుండునవి కావు. కావున, దుఃఖహేతువైన కాలము పైకొనిరాకముందే మేలుకొనవలెను......... ప్రేమరసైక జీవనులైన యీ భిక్షువుల వీక్షింపుము; మమకార వర్జితులై, నిర్జితకాములై, అంతశ్శత్రుల నాఁగి, యక్రూరత్వము నాపాదించి, ధర్మదేవత పాదముల చెంత శాంతమూర్తులెట్లంజలి ఘటియించి భక్తికైంకర్యముల నలుపుచుండిరో కనుఁగొనుము. లోకమం దెట విలోకించినను, క్రూరత్వమును, హింసయునే కనుపించు చున్నవి. ఆఁకలి బాధచే వ్యాఘ్రినిజాపత్యమునే భక్షించునుగాని, మానవులు

పరసంతానమును భక్షించుచున్నారు. ఈ పరహింసారత మైన జగము ననుకంపాదృష్టి నీవంటి రాకుమారు లుద్ధరింప వలయుఁగాని యుపేక్షాభావంబున నూరకుండుట భావ్యము గాదు. జానెఁడుపొట్టకొఱకు సృష్టికంతటికిని దుఃఖమాపా దించు దురితమానవులకన్నఁ గానల గుప్పెఁడు కసవు మేసి, గుక్కెఁడు నీరుగ్రోలి బ్రతుకు జంతుజాలములే మిన్నగదా! అహింసాసత్యములను నేత్రద్వయము నష్ట మయి ధర్మదేవత నేఁ డెట్లంధత్వమున నార్తిఁగుందు చున్నదో చూడుము. * * * పొట్టకింత గంజియైన లభింపక నకనకలాడు నిరుపేద యాఁకలిబాధ నిన్నంట లేదా! రోగార్తులై, మందుమాకులు లేక దురపిల్లు దిక్కు మాలిన యనదమూల్గు నీకు వినుపించుట లేదా! రోగజరా మరణము లీ విశ్వమంతటి నొక శోకభీకరమహాంబుధిగా మార్చి వేసినవి. చూడు మోయీ! యీవిశ్వదైన్యము. కంట నీరు పెట్టుటకు వేయికన్నులైనఁజాలవు. ఆపన్నుల నుద్ధరింప లెమ్ము! నాయనా! లె''మ్మని యుపదేశించి, ప్రణయమే నిష్కేదానందము, బ్రహ్మమని చింతించు నందుని తలంపులు గ్రహించి వాని కా సమీపతరుశాఖావాసిత కపిమిథునముం జూపి, ''వాని సౌఖ్యమున కేమని పేరుపెట్టెదవో చెప్పుము; నీ లతాంగి నీకు వరాలమూటయైన ట్లాకపిచాన యాకపికి నందాలకుప్పయే. ఆ మిథునలీలకును, మర్త్యమనోజకేళికిని రవంతయు భేదములేదు. ఈసౌందర్యంబంతయు నాశనం బై చనుఁగాని శాశ్వతంబుగాదు. సత్యమైన సౌందర్యము

నెఱుంగుము తండ్రీ! విషయాదివికారవిరహితమైన యచ్ఛపుఁ బ్రేమము నరిగిఁపుము. మమకారము విడనాడి, కొడుకులు లేనివారికిఁ గూరిమిబిడ్డఁడవు, మాతృహీనులైన పసిపాప లకుఁ దల్లివియునై సంరక్షణసేయుము. దిక్కుమాలినవారికి దిక్కై, ఆర్తుల కాదరువై పోషణసేయుము. బౌద్ధజాతి కిదియే పరమార్థము ; మానవసేవయే భగవత్సేవ"యని నవధర్మమార్గ ముపదేశింప, నందహృదయము గౌతమధర్మ బోధనలతో నిండి వెల్లివిరిసెను.

నానాఁటికి బౌద్ధవిజ్ఞానము ప్రపంచమంతయుఁ బ్రాఁకెను ; క్రమక్రమముగా భిక్షువులును వృద్ధిపొంది నవ ధర్మదీధితు లాశాంతపర్యంత మీ విశ్వమందంతటను వెదఁ జల్లిరి ; విషయలోలత విజృంభించి హింసారతిచే విధ్వస్తము గావింపఁబడిన మానవప్రపంచమునఁ దిరిగి ప్రేమబీజములు నాటఁబడెను. బుద్ధభగవానుని యవతారకారణము కార్య సిద్ధిని బొందెను. అంతనొక శుభదినమున నా మహాత్ముఁడు నిర్వికల్పసమాధిగతుఁడై యవతారముఁ జాలించెను.

---

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

---

PRINTED AT THE JAI HIND PRESS KURNOOL.